Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషస౦॥ర జ్యేష్ఠ శు॥ ౭ (౨౫-౫-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౯

ఐర్లాండులో నిర్బంధ సైనిక సేవా విధాన విరమణ

102562

నిజాంరాష్ట్ర విద్యార్థి మహాసభ ఆగుట

# నాజీలకు అమెరికా సమాధానము

## క్రీటుయుద్ధమునుగూర్చి చర్చిలుగారు ఒప్పుకొనినమాటలు

### జర్మనీతో పూర్తిగా సహకార మొనర్చవలెనని లవలుగారి ఉపన్యాసము

హిట్లరుతో పదిగంటలసేపు మాట్లాడితినని లావలుగారు మే ౨౩వ తేదీన బయటపెట్టిరి.

గతడిసెంబరులో మార్షలు పెటెయినుగారిని బర్తరఫుచేసినతర్వాత లావలుగారు ఉపన్యసించుటకు ఇదే తొలిసారి. రేడియోలో ప్రసంగించుచూ ఇట్లనిరి:

"మాపరాజయమునకు ప్రజాస్వామ్యము కారణము. మేము ప్రజాస్వామ్యముకొరకై యుద్ధము చేయుదలచుటలేదు. ఫ్రాన్సు మరల నిలవక మరల లేదు. యూరపులోని గొప్పరాజ్యాలతో కలిసి మెలసి శాంతిని సంపాదించవలెను. తర్వాతనిరుద్యోగమును, పేదరికమును అరికట్టకలుగు అట్టి అనుగడచి సోషలిజమును నిర్మించవలెను. ఈ రెండుమహత్కార్యాలను ఫ్రాన్సు సాధించవలెను. స్వానుభవాన్నిబట్టి అమెరికాకు నీతివర్తకమైన మాటలివ్వగలను. మేము జాతీయపునరుద్ధరణమార్గమున నుండగా, అమెరికా మమ్ములను స్తంభింపచేయునా? మీసంపదమాకు కొంతకావలెను. మాసంపద మీకు కావలెను. కాని జర్మనీతో పూర్తిగా కలిసిపనిచేసిన నూతనప్రపంచానికి, నూతనయూరపునకు ఈబడులను ఫ్రాన్సు ఇవ్వగలదు. ఇదిమీకు ఆశ్చర్యముకలుగజేయవచ్చును. కాని ఫ్రాన్సుకు ఇదితప్పనిసరి."

### ఉత్తర ఐర్లండులో నిర్బంధ సైనిక సేవ విధానమునకు డివెలరాగారి అధిక్షేపణ

మే ౨౬వ తేదీ సోమవారం సాయంకాలము ఐర్లండుశాసనసభయగు డెయిలులో ఐర్లండు అధ్యక్షుడగు డివెలరా గారు ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి. ఏవొరుడైనను తనదికాని దేశముకొరకై పోరాడుటకు సైన్యంలో చేరవలెనని నిర్బంధించుటఅక్రమము, అట్టిపని పాశ్చాత్య పౌరస్వాత్వ్యము నకే భంగకరముగును. ఇంగ్లాండుకుచెందియున్న ఉత్తరఐర్లండుభాగములో బ్రిటిషువారు నిర్బంధసైనిక సేవాశాసనమును అమలుపరుచుటకు ఆలోచించుచుండినప్పుడే అట్టిదికూడదని నేను అధిక్షేపించుచు బ్రిటిషుప్రభుత్వానికి తెలియజేసియుంటిని. ఇంగ్లాండుకు ప్రతికూలమయినపనిని దేనిని ఐర్లండుప్రభుత్వము చేయుటలేదు, చేసియుండలేదు బ్రిటిషు ప్రభుత్వమువారు ఉత్తర ఐర్లండులో నిర్బంధసైనిక శాసనమును అమలుపరుచుటకు పూనుకొని ప్రయత్నములను సాగించినయెడల ఇంగ్లాండుకున్ను ఐర్లండుకున్ను వెంకటిద్వేషమ్యద్వేషము మరిరిగి ప్రారంభముకాగలదు. ఉత్తరఐర్లండులో ౬ జిల్లాలున్ను ఇంగ్లాండు ప్రభుత్వానికిలోబడియుండినప్పటికిన్ని అజిల్లాలు ఐర్లండుదేశములో నిఅంతర్భాగములేఅయియున్నవి. అవిషయం కాదనుటకువీలులేదు ప్రపంచంలో ఎట్టిరాజకీయపరిణామములు పరివర్తనములు కలిగినను ఇంగ్లాండున్ను, ఐర్లండున్ను ఎల్లప్పుడు ఇరుగుపొరుగు రాజ్యములుగా నేయుండగలవు. ఐర్లండుతటస్థరాజ్యంగా నేఉండునని ఐర్లాండుప్రభుత్వము ప్రకటించినది. ఇంగ్లాండువలె ఐర్లండుతటస్థమిత్రరాజ్యంగాఉండగలదు. ఇంగ్లాండుకు ప్రతికూలమైనదానిని ఐర్లండు చేయదు. ఇంగ్లండుపై దాడివెడలుటకు ఐర్లండులోని ఏప్రాంతమునైనను శత్రువులుఆశ్రయముగా తీసికొనేయెడల అందుకు ఐర్లాండుఎంతమాత్రమున్ను అవకాశమొసంగదు ఐర్లండులో బ్రిటిషుసేనలుకొన్ని వుంచబడుటకు ఐర్లాండుప్రభుత్వం అనుమతించియుండుటయేపై నచెప్పినరీతిగా ఐర్లాండుప్రభుత్వము బ్రిటనుకు హానిచేయదలంపదనుటకు గ్యారంటీఅయియున్నది అట్లయ్యును, బ్రిటిషువారు ఉత్తర ఐర్లాండులో నిర్బంధసైనిక సేవను అమలుపరచేయెడల, ఐర్లండుకు ఇంగ్లాండుకు స్పర్థలు తిరిగిపెరుగును."

ప్రభుత్వప్రతికూలపక్ష నాయకుడగు కాస్గ్రేవ్ గారిట్లుపన్యసించిరి. ఈసందిగ్ధసమయములో ఇంగ్లాండుకు అయిర్లాండుకు వైషమ్యములను ప్రేరేపించుటతగదు. ప్రస్తుతవిషమావస్థలో అయిర్లాండులకు ప్రభుత్వముసరిగా సవ్యము గావ్యవహరించవని అయిర్లాండుప్రభుత్వానికేముప్పుకలుగును. నిర్బంధసైనికసేవాశాసనమునుఉత్తరఅయిర్లాండులో అమలుపరచుటవల్ల చాలాప్రతికూల ప్రజాందోళనము చెలరేగును. ఈ సైనికనిర్బంధసేవవల్ల ఇంగ్లాండుకు అయిర్లాండువల్లకలిగేలాభంకంటె ప్రతిబంధకమేఎక్కువగును. అయిర్లండులోని ఉత్తరభాగంలోను మిగతా అయిర్లండులోను యాప్రజాందోళనముచెలరేగును, నిర్బంధసైనికసేవాపద్ధతిఅక్రమమునియుకూడదనియు, కార్మికపక్షసభ్యుడగు నార్టనుకూడా వాంచెను.

### ఉత్తర ఐర్లండు ప్రధానిప్రకటన

ఉత్తరఅయిర్లాండులో మే ౨౫వతేది ఆదివారంనాడు చాలా అధిక్షేపణసభలు జరుపబడెను. ఉత్తర అయిర్లాండులో నిర్బంధసైనిక సేవా శాసనం అమలుపరచబడేయెడల అయిర్లాండులోని ప్రజలు ఎక్కువద్వేషభావమును బ్రిటను యెడల చూపగలరని అయిర్లాండులోని కార్మికపక్షసభ్యులు బ్రిటిషుప్రభుత్వపు కార్మికపక్షక్రియసభ్యులకుతెలియచేసిరి,

ఉత్తర ఇంగ్లాండులోని, ప్రధానియగు అండ్రూసుగారు ౨౫వతేదిన లండనునుండి బయలుదేరివెళ్లిరి. వారు లండనులోనున్నప్పుడు బ్రిటీషు ప్రధానియగు చర్చిలుగారితోమాట్లాడిరి ఈసంభాషణలఫలితమును సూచించుచు అండ్రూసుగారొక ప్రకటన త్వరలోచేసెదరు వారిప్రకటన వెలువడినప్పుడే బ్రిటీషుపార్లమెంటులో చర్చిలుగారుకూడా ఒకప్రకటనచేయగలరు.

### చర్చిల్ గారి ప్రకటన

తుదకు మే ౨౭వతేదినాడు బ్రిటిషుపార్లమెంటుకామన్సుసభలో ప్రధానిచర్చిల్ గారు ఒకప్రకటనచేయుచు, ఉత్తర అయిర్లండులో నిర్బంధసైనికసేవాపద్ధతినిప్రవేశపెట్టుటకుబ్రిటిషుప్రభుత్వమునకు అధికారమున్నను లేకున్నను, దానివల్లలాభంకంటె కష్టములేఎక్కువని చెప్పిరి,

### డచ్చి స్టీమర్లను బ్రిటిషువారుపట్టుకొనుట

డచ్చి యీస్టుయిండీసు దీవులకున్ను జపానుకున్ను మధ్య ఫిలిప్పయినుదీవులలోని మనిలారేవుకున్ను హాంకాంగుకున్ను మధ్య ౩ డచ్చిస్టీమరులు బ్రిటిషుకాశాపరాధికారులచే పట్టుకొబడినవట.

### అమెరికాలో ౫౫౦ క్రొత్తనావలకు ౩౫౦ కోట్ల డాలర్లు

వాష్టింటను, మే ౨౭

అమెరికను యుద్ధకాకాలశాఖవారు ౫౫౦ అదనపు నావలను క్రొత్తగానిర్మించుటకై ౩౫౦ కోట్ల డాలర్లను మంజూరుచేయవలెనను చట్టమునుశాసించుచు అమెరికా ప్రసిడెంటగు రూజువెల్టు సంతకముచేసెను,

### నాజీలకు అమెరికా జవాబు

అమెరికా ప్రెసిడెంటగు రూజువెల్టుగారు మే ౨౭వ తేది రాత్రి అమెరికా ప్రజలనుద్దేశించియు అఖిలప్రపంచరాజ్యాలలోని ప్రజలనుద్దేశించియు ఇట్లుప్రసంగించిరి:—

"నాజీలు ప్రపంచములోని ప్రజాస్వామ్యరాజ్యాలనన్నింటిని కూలద్రోయవలెనని యత్నించుచున్నారు ఇటువంటిసందర్భంలో అమెరికా సంయుక్తరాష్ట్రములప్రభుత్వము జోక్యంకలుగజేసికొనకుండ నిర్లిప్తముగానుండజాలదు, కనుక, అమెరికాను అణగద్రొక్కవలెనని జర్మనులు ప్రయత్నించకపూర్వమే, అమెరికాకుసమీపంలో జర్మనులు స్థావరములను సంపాదింపకపూర్వమే అమెరికాయొక్క సైనిక బలమును పూర్తిగాఅయత్తము చేయవలసియున్నది యుద్ధసమయావసరము అమెరికాకువచ్చినదనియు "విపరీతమైన జాతీయ పద్ధర్మములను" ప్రయోగించవలసియున్నదనియు అమెరికాఅధ్యక్షుడనగు ఫ్రాంక్లిను డి రూజువెల్టుఅను నేను నేడుప్రకటించుచున్నాను. కనుక అమెరికాయొక్క నౌకాబలమును విమానబలమును మెట్టసైన్యమును యుద్ధసన్నద్ధముగా యుద్ధావసరమునకుతగినట్లుగా సన్నాహము చేయవలసియున్నది.

పౌరసరఫ్ సార్ధమైన కట్టుదలకూడాచేయవలసియున్నది కాబట్టి యీతరుణములో ప్రజలందరును కార్మికులను వ్యాపారస్థులను ధనికులైన అసాములును అ దరును మనఆర్థిక సౌభాగ్యమును రక్షించునట్టి స్వాతంత్ర్యములను కాపాడుటకై ఏకీభవించి అమెరికాప్రభుత్వమునకు తోడ్పడవలెనని విజ్ఞాపించుచున్నాను.

అమెరికాప్రభుత్వపు మెట్టసైన్యమునకు విమానశాఖకును నౌకాసైన్యమునకు పెంచుటనిమిత్తమై ౩౩౧౫౦ లక్షల డాలరులు గావలెననియు యీమొత్తమును మంజూరు చేయవలసియున్నదనియు అమెరికాశాసనసభయగు కాంగ్రెసు సభవారిని రూజువెల్టుగారుకోరిరి మెట్ట సైన్యంకొరకై ౨౫౦౦ లక్షలు డాలరులున్ను—౫౦౦ లక్షల డాలరులు నౌకాదళవిమానములకున్ను, చెల్లింపబడును—అని తెలియజేయుచు రూజువెల్టుగారి కార్యదర్శియగు ఆర్లీగారు శాసనసభాధ్యక్షులగు రేబర్ను గారికిలేఖవ్రాసిరి. ఎన్ని విమానాలు నిర్మింపబడునో వివరించలేదు

రూజువెల్టుగారు మే ౨౭వతేదిరాత్రి అమెరికాప్రజలనుద్దేశించియు అఖిలప్రపంచరాజ్యముల నుద్దేశించియుగావించిన రేడియో ప్రసంగములో నిట్లుచెప్పిరి.

హిట్లరు ఇంకాఇంతకుమించి విజృంభించకుండామనము హెట్లరునుఅరికట్టనియెడల అమెరికా ఖండముమీదకూడా నాజీలుతమ అస్త్రప్రయోగములను చేయగలరు.

అమెరికాఖండంలోని వివిధప్రజాస్వామ్యరాజ్యాలన్నింటితోను కొన్ని ఒడంబడికలను చేసుకొనవలెనది ఇందువల్ల అమెరికాఖండంలోనిరాజ్యములన్నింటికిని రానున్న యీమహావిపత్తును తొలగించుటకై అమెరికాఖండరాజ్యాలన్నియుఏకముకావలసియున్నవి అందుకొరకై యీఒడంబడికలు వ్రాసికొనబడినవి.

### ఆచరణ ఎప్పుడు

రూజ్వెల్టుగారు ఉపన్యసించినతర్వాత మిగిలిపోయిన కొన్ని సంగతులగురించి స్పష్టపరచుటకై మే ౨౮వ తేదిన పత్రికాసమాలోచనసభ జరిపిరి.

తాటస్థ్యచట్టమును రద్దుచేయవలెనని కోరదలచలేదు. దానినిసవరించుటనుగురించి ఆలోచించుటలేదు. గొప్పజాతీయావిపత్తునుగురించి చేసిన ప్రకటనను అమలుపెట్టుటకు ప్రస్తుతము కార్యాచరణఉత్తరువులను జారీచేయదలచుటలేదు. అని రూజ్వెల్టుగారు తెలిపిరి. అట్టిఉత్తరువులు జారీచేయనిదే ప్రకటనవలన కలిగినఅధికారముక్రింద చర్యతీసుకొనవీలులేదు.

యుద్ధనావలను తైనాతీగపంపువిషయమై రూజ్వెల్టుగారు స్పష్టంగా ఏమియు చెప్పలేదు-కాని తాటస్థ్యచట్టమునకు అనుగుణముగానే సముద్ర స్వాతంత్ర్యమును నిలుపుకొనవచ్చునని అనెను. యుద్ధప్రాంతములని ప్రకటింపబడినవాటిలో అమెరికానావలు వ్యాపారంచేయుట తాటస్థ్యచట్టమును ఉల్లంఘించినట్లగును. అపనిచేయదలచలేదని అధ్యక్షుడు తెలిపెను

జపానుకునూనెఎగుమతులుతగ్గించవలెనని ప్రభుత్వమువారు ఆలోచిస్తున్నారాఅని అడుగగా ప్రస్తుతం అట్టిఉద్దేశ్యమేమియులేదని అధ్యక్షుడు చెప్పెను.

క్రొత్తవిపత్తుస్థితి ప్రకటించినందువల్ల అధ్యక్షునికివచ్చిన అధికారాలనుబట్టి, ఆయన రేడియోస్టేషనులను, విద్యుచ్ఛక్తి కేంద్రములను, జలాశయములను, తూములకాల్వలనుతనస్వాధీనం చేసుకొనవచ్చును. ఏరకంయానములోనైనా సైనికులకు మంచిసౌకర్యం ఇవ్వవలసినదనికోరవచ్చును, సెక్యూరిటీలు, మారకపువ్యాపారం తాత్కాలికంగా ఆపవచ్చును. యుద్ధం ప్రకటించుటకు కాంగ్రెసుకుమాత్రం అధికారంకలదు.

### క్రీటుయుద్ధముగూర్చి చర్చిలుగారు ఒప్పుకొన్న విషయములు

మే ౨౭వతేదిన కామన్సుసభలోబ్రిటిషుప్రధాని చర్చిలుగారుపన్యసించుచు ఇట్లుచెప్పిరి,—

మధ్యధరాసముద్రములో క్రీటువద్ద రెండుబ్రిటిషుక్రూయిజర్లు (౧) గ్లస్టరు (౨)ఫీజీ ముంచివేయబడెను ఇవిగాక (౧ జూనో (౨)గ్రేహౌండు (౩)కెల్లీ (౪)కాష్మీరుఅను నాలుగు డిస్ట్రాయర్లు కూడనష్టమైనవి ఈ నావలలోనివారు చాలామంది రక్షింపబడిరి.

రెండుయుద్ధనావలకున్ను, పెక్కుక్రూయిజర్లకును దెబ్బలుతగిలినవి తీవ్రమైనదెబ్బలేమియు తగులలేదు. వీనిలోకొన్ని వెంటనేమరమ్మతుచేయబడితిరిగిసముద్రపర్యటనం సాగించుచువేయున్నవి.

మటపానువద్ద మధ్యధరాసముద్రంలో యిటీవలలో ఇటాలీయుయుద్ధనావలతోనౌకాయుద్ధంజరిగినఅనంతరంనుండి యిప్పటికి మధ్యధరాసముద్రంలో బ్రిటిషునౌకాదళము చాలాహెచ్చినది.

జర్మనుసేనలు నావలమీద క్రీటుకోనికి దిగకుండా బ్రిటిషుయుద్ధనావలుచాలాసమర్థతో నిరోధించుచున్నది, కానికొన్నిచిన్నచిన్న గ్రీకునావలమీద అప్పుడప్పుడుకొన్నిజర్మనుసేనలు తప్పించుకొనివచ్చిదిగుచున్నవి ఈజర్మనుసైన్యములను గొనివచ్చుచుండినావలకు బ్రిటిషు జలాంతర్గాములు నుక్రూయిజర్లున్ను డిస్ట్రాయర్లున్ను చాలాగొప్ప నష్టమును కలుగజేసినవి.

ఇరాకులో బ్రిటిషువారికి తిరిగియథాపూర్వంగా స్థావరము స్థానబలము చిక్కినది."

### గొప్ప జర్మనుయుద్ధనౌక ముంచివేయబడుట

"బిస్మార్కు"అను జర్మనుయుద్ధనావకొరకై అట్లాంటిక్కు మహాసముద్రములో బ్రిటిషువిమానాలువెటాడుచున్నవి. బ్రిటిషు టార్పెడో బాంబువిమానాలు మే ౨౬వతేదిసోమవారము సాయంకాలము 'బిస్మార్కు' నావమీద టార్పెడోను ప్రయోగించెను తుదకానావమునిగిపోయెను. బిస్మార్కుఅనుజర్మనుయుద్ధనావ జర్మనుయుద్ధనౌకాదళములోకెల్ల చాలాగొప్పది మే౨౪వతేదిశనివారంఉదయం గ్రీన్ లాండువద్ద బ్రిటిషుయుద్ధనావలును జర్మనుయుద్ధనావలునుఎదురెదురైపోరాడినవి. తిరిగిజర్మనుయుద్ధనావలకొరకై బ్రిటిషు నావలు అట్లాంటిక్కుసముద్రంలో వందలకొలదిమైళ్లదూరంతిరిగినవి ౨౬వతేదినాటికితిరిగి దానిజాడ తెలిసికొగలిగినవి

మే౨౫వతేదిన ౬వేలటన్నుల జర్మనువర్తకనావమీద బ్రిటిషువిమానాలుబాంబులువేయుటవల్ల ధ్వంసమూలితలై శిధిలనౌకాభాగము గాలిలో ఎగిరెను మరొకరవేలటన్నుల జర్మనువర్తకనావ నిప్పంటుకొనిపోగలో ఆవరింపబడెను. ఇంకను చాలానావలుదెబ్బలుతగిలిచెడినవి.

రెండుజర్మనునావలు మరాలపైమే ౨౫వతేది పగలు బ్రిటిషువిమానాలుబాంబులువేయగా ఫలితములునిర్ధారణగా తెలిసినవి ఈజర్మను నావలముకాంపోలండు, జర్మనీ, డెన్మార్కుకోస్తాల సమీపంలోఉండగా బ్రిటిషువిమానాలు బాంబులనువేసియుండెను ఈవిహారసదాడికి రెబ్రిటిషు విమానాలు కన్పించుటలేదు.

### సింగపూరులో అమెరికానౌకలు

'హెరాల్డు ట్రిబ్యూను' అను అమెరికాపత్రిక మే ౨౬వ తేది నాటి సంచికలో సంపాదకీయమందు రూజ్వెల్టుగారు త్వరలోనే అమెరికా సంయుక్తరాజ్యము యుద్ధములో దిగవలసివచ్చుననిస్పష్టముచేసి ఏదోఒక పెద్దచర్య నవలంబించవలెననియు, బ్రిటనుకుపంపించేయుద్ధసామగ్రిని తీసికొనిపోవునౌకలకుతోడుగా అమెరికావారియుద్ధనౌకలుండవలెననియు, సింగపూరులోఅమెరికావారియుద్ధనౌకలనుంచవలెననియు, అమెరికాతటస్థదేశముకాబట్టి అమెరికానౌకలు యుద్ధముచేయుచున్నదేశాల వులకు పోరాదనుశాసనమునురద్దుచేయవలెననియు సూచించబడినది.

### బాలికలఅష్టకం

(ఇటీవల క భద్రోణంలో ఉమాపార్వతిఅనే ౯ ఏండ్లబాలికను ఎవరో ఎత్తుకొనిపోయినారట. సమీపంలోఉన్న పులియాంచేరి ఆశ్రమానికి ఎత్తుకొనిపోయిఅచటనుండి మద్రాసుకు తీసుకొనిపోయినారట. మద్రాసులోఒక అంధునకు ఆమెనుఇచ్చి పెళ్లిచేసారట. ఇదంతాపోలీసు దర్యాప్తుమీద తెలిసింది ఈసందర్భంలో మద్రాసులో కొందరిని అరెస్టుచేసారు. వెంకట్రామయ్యఅనునియమ్మాళు, మరొకమునియమ్మాళు అనువారిని అరెస్టుచేసారు, ఇంకాకొంతమందిని అరెస్టుచేయాలని వెతుకుతున్నారు. ఈఅరెస్టుచేయబడినవాళ్లు కుంభకోణంలోను, తెనాలిలోను, హైదరాబాదులోను కొన్నిముఠాలుగాఏర్పడికాపురం చేసిఉంటున్నారు. ఆడపిల్లలను తీసికొనివచ్చి అంధ్రులకుఅమ్మి రొక్కము పుచ్చుకొంటున్నారు కూడా పిల్లలను బ్రాహ్మణులకుకూడా వివాహం చేసిఅంటగట్టుతున్నారు.

బెజవాడలోకూడా ఒకఅయ్యరును అరెస్టు చేసినారనివిన్నాము.)

(ఆంధ్రపత్రిక)

# ఈరానీలదండయాత్ర

మహిబూబునగరుజిల్లాలో

గ్రామగ్రామంలో బలవంతపుచందాలు

## కోళ్లుమాయం

బంద్ల పెట్టి

సుమారు ౬౦ మంది ఈరానీలు మహిబూబునగరుజిల్లాలలోని మొగిలిగిద్దప్రాంతములోనె అదినాలనుండి దండయాత్రలుసాగించి పౌర్జన్యాలుచేసి జనులనుకష్టపెట్టి యిప్పుడు కొడంగల్ తాండూరుమార్గములో వెంచేసియున్నారు.

౨౫ దినాలక్రిందట ఈ యీరానీతాండా షాదునగరులో ప్రత్యక్షమైరి. ఆటుతర్వాతకొందుర్గు వెళ్లిరి. అచ్చట ఒక గంటలోపలవారికి ౨౦౦ రూ॥ చందగలు గ్రామస్థులు వసూలుచేసి మూటను సమర్పించుకొని వారికి సలాముకొట్టి వేర్ గ్రామానికి సాగనంపివచ్చినారు. తర్వాత వారు సర్దారునగరానికి విజయంచేసినారు. అచ్చటకూడ ఒకేగంటలోపల ౧౦౦ రూ॥ వరకు వారికి ముడుపుచెల్లించుకోవైనది. తర్వాత వీరు మొగిలిగిద్దలో ప్రవేశించినారు. అచ్చట చేరేచే రకముపై మాదిగివారివి రెండుకోళ్ళనుపట్టి వెడలిపోదినారు. మరికొన్నింటిని పట్టుకొన్నారు. అంతలో మాదిగ గేరిలో అలజడిపుట్టింది. బీద మాదిగలకు కోళ్ళేఆస్తి. అవికూడాపోతే వారికి రెండుదినాలభక్ష్యంపోయినట్లు. అందుచేతవారు ౫౦–౬౦ మందిచేరి కట్టెలుతీసుకొని యుద్ధానికిసిద్ధపడిరి. అప్పై ఈరానీలకు తమఆటలు అక్కడసాగవని తెలిసి కోళ్ళను వాపసుయిచ్చినారు. చంపినకోళ్ళఖరీదుఇచ్చినారు. అక్కడినుండి మరొకస్థలానికి ప్రయాణమైనారు.

కోస్గికివెళ్లగా అచ్చటసుమారు ౨౦౦ మంది మున్నూరుకాపులు తిరుగబడినారు. అప్పుడు మున్నూరువాడనువదలి యితరబాగాలలో తమ దండయాత్రను సాగించినారు. షాదునగరువద్ద ఒకగ్రామంవారు వీరువచ్చేసంగతితెలుసుకొని కట్టెలుపట్టుకొని దండయాత్రకులను ఉదుకుడుగా స్వాగతమిచ్చేదానికిసిద్ధపడినారు ఈసంగతి ఈ రానీలకు తెలిసి వాగువరకువెళ్లినవారు తిరిగి వాపసువెళ్లిపోయిరి వీరు సాధారణముగఒకచోట డేరాలువేసుకొని చుట్టు ౭–౮ మైళ్లదూరంలోని గ్రామాలమీదపడుదురు బంద్లనుకట్టిపెట్టుదురు. కోళ్ళను బలవంతముగా ఎత్తుకొనిపోదురు సాధారణముగ వీరివెంటఒకపోలీసుజవానుఉండును గ్రామస్థులు సాధారణముగా ఈరానీలువచ్చినార నేవరకు మహాభీతితో ఇండ్లుమూసుకొందురు. ఒంటిపైసొమ్ములనూడ్చి పాతిపెట్టి దాచెట్టుకొందురు. అట్లున్నను గ్రామపటేలు పట్వారీలు వారిదెబ్బకుతాళలేక గ్రామంపై చందాలువేసి ముడుపుకట్టి వారికిత్తురు. ఆముడుపును తీసుకొని ముందుకే మైనవ్యవహారంఐనా తప్పించుకొనేదానికి ఈరానీలు గ్రామస్థులతో మేముమాసంతోషమువెంట వీరికి ఈచందాలను అనుగ్రహించినాము అని వ్రాయించుకొందురు. సాధారణము గామంచి పటలకువచ్చే ఒక్కొక్క గ్రామములో ఒకటిరెండుదినాలు పోరాడినను ప్రాధేయపడిన ను ౧౦ రూపాయీలు వసూలుకావలెనంటే మహాకష్టము. అట్టిచో గ్రామస్థులు ఈరానీలకు సంతోషముతో ఇష్టపూర్తిగా ౧౦౦ రూ॥ ౨౦౦ రూ॥ ఈప్రకారం గ్రామములలో ఒకగంటలోపలనే వసూలుచేసియిచ్చుటను ప్రభుత్వాధికారులు గమనించగలరు. ప్రభుత్వమువారు వెంటనే వీరిదగ్గ పట్టీలను జప్తీచేయవలెను. గ్రామజనులకు వారివారిపైకం వాపసుఇప్పించవలెను. ఈరానీలు తిరిగినగ్రామములలో విచారణచేయించవలెను. రైతులును భయపడకుండా యథార్థమును ప్రభుత్వాధికారులకు తెలుపుకొనవలెను.

—





## ఖమ్మంమెట్టు

వర్తక గుమాస్తాల సంఘము

ఖమ్మంమెట్టు వర్తకగుమాస్తాలసంఘసభ్యులు యీవైశాఖ బ॥ అమావాస్య ఆదివారమురోజున శ్రీ...వారిసత్రమునందు సమావేశమైరి. వరంగల్ గుమాస్తాలసంఘమువారినుండి ఖమ్మంమెట్టు సంఘకార్యదర్శిగారికివచ్చినలేఖ చదివివినిపించబడెను, ఇతరగుమాస్తాసంఘములవారినియమములు, పరిస్థితులుతాము సేకరించినంతవరకు సభ్యులకువిశదీకరించబడినవి. తమకష్టసుఖములను గూర్చి పాట్లనువిశదముగా చర్చించుకొన్నతరువాత ముఖ్యముగా యీక్రిందితీర్మానములు ఆమోదించబడెను,

౧. శ్రీవర్తకసంఘమువారిచే దయతో అనుగ్రహింపబడిన అమావాస్య సెలవుదినమును అందరుగుమాస్తాలును సక్రమముగా వినియోగించుకొనవలయును,

౨ జ్యేష్ఠబ॥ అమావాస్యవాడు సమాజసభను జరిపి యీలోగాతీర్మానించేయింపబడిన సంఘనియమావళిని, గతసంవత్సరము నుండి సంఘముయొక్క కార్యక్రమనివేదన సభ్యులకు సమర్పించుకొనుటకై కార్యదర్శినికోరనైనది.

౩ సంఘములో విరివిగా సభ్యులనుచేర్పించుటకు అతిమునుముగాకృషిచేయవలెను.

యీతీర్మానములు ఏకగ్రీవముగాఆమోదింపబడినవి ఈదయముమమాసంగంటలకు సమావేశముపూర్తిచేయబడినది. సాయంత్రముమరలయీగుమాస్తాలందరునుకలసి ఈఅమావాస్య సెలవునూడా గుమాస్తాలకుయివ్వనంగీకరించు వర్తకయజమానులవద్దకువెళ్లి, ప్రచారముజేసి, వారినిఒప్పించి, తమసంభాషణలచేవారినిమెప్పించి సెలవుయిప్పించగలమని వాగ్దానములుగైకొనిరి.

—

ఖమ్మంమెట్టు వర్తకప్రముఖుల సముఖమునకు

ఖమ్మంమెట్టునందు ఒకఆంగ్లబాలికాపాఠశాల కమానుబజారులోను, మరియొక్కటికొత్తబజారులోను. కొంతమందివర్తకప్రముఖుల యాజమాన్యమునజరుగుచున్నవిషయ మందరికిని విదితమే. కొనికొంతమంది వర్తకప్రముఖులు యీమధ్యవర్తకసంఘమువారియాజమాన్యమున వేరే బాలికాపాఠశాలను నడుపబోవుచున్నారనివినికిడి. యిది యెంతమాత్రమునిజమో తెలియదు, ఆర్థకష్టములు తైనాధీనములుగాని దీనివలన ధనవ్యయమధికమగును. కనుక ముందుగట్టి నిర్ణయమును ప్రస్తుతమునడుపబడుచున్న రెండుబాలికాపాఠశాలలను చేయూతనొసంగేవరకు గాకయని వర్తకప్రముఖులను మరియుపురజనులను ప్రార్థించుచున్నాను.

ఇట్లు

ఏ. యస్. భూషణము.

## వరంగల్లు

### శ్రీ నృసింహ జయంతి

(ఒక విలేఖరి)

స్వస్తి శ్రీ వృషనామసంవత్సర వైశాఖ శుద్ధ శుక్రవారమురోజున వరంగల్ పుర వాస్తవ్యులగు శ్రీమాన్ తంగూల వెంకట నరసింహాచార్యులుగారు చెన్నుగౌండ–(పురవ్) ఖిలేజవర్ గఢలో గుట్టమీద పైజయంతిని అతివైభవముగా ౨–౩–వందలమందికి అన్నదానముచేసినారు.

యిందు ఆగ్రామనివాసులగు భార్మికమహాశయులు చాలాపాల్గొన్నారు.

# అధ్యక్షోపన్యాసము

యూరపునందుండు ఇటలీదేశ ప్రభుత్వాదాయము సంవత్సరమునకు ౨౬౦ కోట్ల రూపాయీలు. ప్రస్తుతము ఇటలీదేశపు రాజగు ఏమాన్యుయల్ గారు తమభరణవ్యయమునకై ౧౮౦౦౦౦౦ మాత్రమే గైకొంటారు మైసూరు సంస్థానముయొక్క ఆదాయము ఇటలీదేశపు ఆదాయములో అరువదియవభాగము, తిరువాన్కూరుది నూటమువ్పదియవభాగము. ఐనప్పటికి మైసూరు మహారాజాగారు ఇటలీదేశపు రాజుకంటె సుమారు పది లక్షలధికముగాను తిరువాన్కూరు మహారాజగారు మూడులక్షలుమాత్రమే తక్కువగానుఅనుభవించుతారు. సత్పరిపాలనావిధానము గలవిగా భావింపబడు మైసూరు, తిరువాన్కూరులయందే ఇట్టిపరిస్థితులుండ వేరేసంస్థానములగురించి నేను వ్రాయవలసినవసరములేదు,

గాంధీమహాత్ముడు ౧౯౩౦ సంవత్సరమున సత్యాగ్రహోద్యమ ఆరంభమునకుపూర్వము ఇర్విను ప్రభువుగారికి వ్రాసిన సుప్రసిద్ధలేఖయందు, భారతదేశపు వైస్రాయిగారు ఒకభారతీయుని సగటు ఆదాయముకంటె ఐదువేలరెట్లధికముగా వేతనము ననుభవించుచున్నట్లుఆక్షేపించినారు. వైస్రాయిగారు ఐదువేలరెట్లనుభవించితే మనదేశీయ సంస్థానాధీశులెన్నిరెట్లు ఎక్కువఅనుభవించుతారో లెక్కించండి.

గత మూడు నాలుగు సంవత్సరములలో సంస్థానప్రజలయందుకూడా బ్రహ్మాండమైనజాగృతి గలిగినది. సంస్థానాధీశులఛత్రచ్ఛాయక్రింద ప్రజాస్వామికపరిపాలనమును స్థాపించుఉద్యమములు అభివృద్ధిజెందినవి. స్వాతంత్ర్యపోరాటములు విరివిగావివిధసంస్థానములయందు సాగింపబడినవి ఈఉద్యమములనణచు అధికార ప్రయత్నముగూడాతీవ్రముగాజరిగినది. ప్రజలపౌరసత్వముల నణచుటకై ఒకదానికంటెనొకటి కఠినములగు శాసనములుగావింపబడినవి. సత్యాగ్రహులుఖైదీలుగా కొట్టబడిరివిధములగు హింసలకులోనుకావలసివచ్చినది. ఆస్తులుజప్తుచేయబడినవి. నిర్దోషులగుప్రజలపై తుపాకులుపేల్చబడినవి. హింసలసహింపలేకఎన్నిరాసంస్థానములయందలిప్రజలు తమఆస్తులు, ఇండ్లువదలివలసపోవలసివచ్చినది. ఇన్ని హింసాపద్ధతులవలంబింపబడినప్పటికిని స్వాతంత్ర్యోద్యమమణచబడలేదు. ఈ మహోద్యమము చివరకుఫలితము ఈనాడుగాకున్న రేపైనసంస్థానప్రజలకులభించితీరగలదని ప్రపంచచరిత్రయే మనకుచాటుచున్నది.

ఈసంస్థానములన్నిటియందును ప్రజాస్వామికప్రభుత్వవిధానములు స్థాపింపబడినప్పటికిని వీనిలో కొన్నిమాత్రమే భావిభారతదేశమునందు స్వతంత్ర తరిపాలనావిధానముగలిగియుండు నర్హతగలవి, మిగిలినవన్నియును తమప్రక్కనుండు రాష్ట్రములలో కలిసిపోవలసియుండును.

యుద్ధానంతరము భారతదేశము బ్రిటిషు సామ్రాజ్యములో నొకభాగముగాన్యూజిలాండు స్వాతంత్ర్యముబొందనిందు, లేక బ్రిటిషుసామ్రాజ్యమునుండి విడిపోయిసంపూర్ణస్వాతంత్ర్యము బడయునిందు దేశీయసంస్థానములు అఖిలభారతరాజ్యాంగవిధానాన్ని అంగీకరించి, భారతదేశముయొక్క విడదీయరానట్టి భాగములు (constituent units)గా నుండవలయునని సంస్థానప్రజలుకోరుచున్నారు. భారతరాజ్యాంగ విధానము స్వాపరిపూర్ణమగు సమాఖ్యావిధానముతో నేర్పడుగున అవకాశముగలదని అన్నిపక్షములవారును అంగీకరించియున్నారు అట్టిసమాఖ్యయందు బ్రిటిషురాజ్యములతోబాటు దేశీయసంస్థానములుకూడా చేరి, దానియందిమిడియున్న రాష్ట్రీయస్వాతంత్ర్యము అనుభవించుచు. అట్టిభారతజాతి ఐక్యతలో ఇమిడియున్న ఆర్థిక, రాజకీయసౌకర్యములన్నియును పొందుటయేగాక, అవసరమగుత్యాగముకూడాచేయుటకు సిద్ధముగానుండవలయునని సంస్థానప్రజలఅభిమతము. బ్రిటిషుసామ్రాజ్యమునందు దేశీయసంస్థానములను అలుప్తముగాచేయుప్రయత్నమును, మరియు స్వతంత్రభారతదేశమునందు సంస్థానములను స్వతంత్రదేశములుగాచేయుప్రయత్నములను సంస్థానప్రజలు ప్రతిఘటించెదరని నేనుచెప్పనక్కరలేదు. ఈవిధమైనవిశేషములేమితో, మనవిజేయునవసరములేదు. సంస్థానములు రాజకీయద్వీపములుగానుండి సంపూర్ణఆర్థిక, రాజకీయవికాసమును బడయలేవు. నేటియుద్ధమునందు యూరపునందున్న చిన్నచిన్నదేశములగతి ఏమగుచున్నదో గమనించిగుణపాఠముల నేర్చుకొనదగును.

౧౩౫౦ ఫసలీకి సంబంధించిన ప్రభుత్వఆయవ్యయముల అంచనాపట్టిక (బడ్జెటు) ప్రకారము మన ప్రభుత్వాదాయము సుమారు తొమ్మిదికోట్ల రూపాయీలనియు, వ్యయము ఎంచుమించుగా నేనుయనియు తెలియును.

ప్రజలఅభివృద్ధికారణములగు జాతీయనిర్మాణశాఖలపైమిగుల స్వల్పమైన మొత్తములుమాత్రము వ్యయముగావింపబడుచున్నవి. ప్రజలదృక్పథమే అవసరమైనట్టి వ్యయమెన్నియోగావింపబడుచు, జాతీయనిర్మాణశాఖలు ఉపేక్షింపబడుచున్నవి పోలీసుశాఖపై ౬౭ లక్షల మొత్తమువ్యయముజేయుచు, ప్రజలఆరోగ్యము గాపాడువైద్యశాఖపై ముప్పదిలక్షలు మాత్రమే వ్యయముగావించుటయందున్న తత్వమును మీరే గ్రహించుకోవలయును.

ఈ ఆయవ్యయముల నిర్మాణమునందు మన రాష్ట్రమునందలి జనసామాన్యము జెందినట్టి ముఖ్యాతిముఖ్యమైన దారిద్రసమస్య పరిష్కారము నుదృష్టియందుంచుకోబడలేదు. దారిద్ర్యతుఃబాధలు, హిందూజనసామాన్యము నేవిధముగా బాధించుచున్నవో, మహమ్మదీయ, క్రైస్తవజనసామాన్యమునుగూడ అదేవిధముగా బాధించుచున్నవి. ప్రభుత్వమువారిచే నిరుద్యోగమును దూరముజేయుటకై ఏమాత్రము ప్రయత్నముగావింపబడలేదు పరిశ్రమాభివృద్ధికై మూడు లక్షలనలుబదిరెండువేల రూపాయీలుమాత్రమే వ్యయము గావించు పరిపాలనావిధానమునందే సమస్యాపరిష్కార మెట్లుజరుగును?

జాతీయనిర్మాణశాఖలపై వ్యయము గావింపబడుస్వల్పమొత్తములుగూడా అన్నివర్గములవారికి సమముగాజెందుటలేదు. ఎక్కువమొత్తము ధనికవర్గమువారికిని, పరిపాలకవర్గమువారికిని లాభదాయకమగునట్లు వ్యయముజేయబడుచున్నది. బీదలు తగినంతలాభపడుటలేదుడ ఆరోగ్యవిద్యాసౌకర్యము లెక్కువగా ధనికపరిపాలకవర్గమువారికిని లాభదాయకమగునట్లు వ్యయముజేయబడు చున్నవి- బీదలు తగినంత లాభపడుటలేదు. ఆరోగ్యవిద్యాసౌకర్యము లెక్కువగా ధనికపరిపాలక వర్గముల వారుండేపట్టణస్థలములయందే ఏర్పాటుగావింపబడినవి. పట్టణముల పునఃనిర్మాణమునందును, పరిశుభ్రతయందును, రోడ్లు వేయుటయందును గుడిసెలు (Slums) బొత్తిగా ఉపేక్ష జేయబడుచున్నవి- ఇతరశాఖలన్నిటియందును ఇదేవిధానమవలంబింపబడుచున్నది-

### ప్రభుత్వోద్యోగుల వేతనములు

ప్రభుత్వన్నతోద్యోగుల వేతనములు విపరీతముగానుంచి ఎంతయో మొత్తము మ్రింగుచున్నవి- ప్రభుత్వమువారుప్రకటించిన సివిలులిస్టు మొదలగువానిలోనిసంఖ్యను పరికిస్తే కేవలము రెండుకోట్ల రూపాయీలైన ఉన్నతోద్యోగుల వేతనముల క్రింద వేవ్యయమగుచున్నదని తెలినది మన ప్రధానామాత్యునికి మాసమునకు ఎనిమిదివేలకల్దారు రూపాయీల వేతనము, కార్యనిర్వాహకసభ్యులకు ఇతరసభ్యులకు మూడువేలకుతక్కువగా గాని వేతనములు మనప్రభుత్వాదాయమును, మన ప్రజల దారిద్ర్యమును దృష్టియందుంచుకొని పరిశీలించిన ఈసంఖ్యలు మిక్కిలి అధికముగా నున్నవి.

ఉదాహరణముగా ఈసంఖ్యలను జపానుదేశ మందలిసంఖ్యలతో పోల్చిచూచినచో, ఉన్నతోద్యోగులను మనకార్యము కలిగింపకమానదు. అన్ని విధముల భారతదేశముకంటె మిగుల ధనికమైనది. అచ్చట ప్రధానామాత్యునికి, మన ప్రధానామాత్యునికన్న ఎన్నియోరెట్లధిక బాధ్యతగలదు. కాని జపాను ప్రధానామాత్యుడు మాసమునకు ౧౫౦౦మాత్రమే వేతనముగా గైకొంటాడు. ఇతరజపాను మంత్రులవేతనము ౧౧౧౦ రూపాయీలుమాత్రమే. జపాను ప్రధానామాత్యుడు ఒకసంవత్సరమునందు గైకొన్న వేతనముకంటెనెక్కువగా మన ప్రధానామాత్యుడు ఒక మాసమునందే గైకొనుచున్నాడన్న మాట.

ఇట్టిఅధికమైన ప్రభుత్వోద్యోగుల వేతనాలు దరిద్రులమగు మనముభరింపలేమని మన ప్రభుత్వమువారికి తెలియకపోలేదు. ఐననుమనముపట్టుదలతో ప్రభుత్వమువారికి తెలుపవలసియున్నది. మన దారిద్ర్యమునకుతగినట్లే మనముమన ప్రభుత్వోద్యోగులవేతనము లుండవలయును. మాసమునకు౫౦౦ రూపాయీలకంటె అధికముగా మనప్రభుత్వవిధానంలోఏఉద్యోగికి నీయబడగూడదనియు మనము కోరవలసియున్నది.

### ప్రభుత్వాదాయ విధానము

ప్రభుత్వాదాయమంతా నేడు బీదప్రజలే చెల్లించుచున్నారు జాగీర్దారు, సంస్థానాధీశులు సాహుకార్లు, వేలు వేతనాలుగాపొందు ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వఆర్థిక భారమునందు మిగులస్వల్పముగామాత్రమే భరించెదరు. పన్నుల భారమంతయు జనసామాన్యమే చెల్లించుచున్నది. మాల్గుజారిపన్ను జనసామాన్యమే చెల్లించుచున్నది- ది-అబ్కారిపన్ను అత్యధికముగా వారిపైననే బడుచున్నది-కరోడగిరి ప్రత్యక్షంగా వర్తకులు చెల్లించినప్పటికి, పరోక్షంగా జనసామాన్యముపైన నేపడుచున్నది- రైల్వే ఆదాయముగూడా ఇదేవిధముగవచ్చుచున్నది- ధనికవర్గముపైన ఆదాయము మరియు ఇతరపన్నులు వేసి, జనసామాన్యముపైనుండు ఆర్థికభారము తగ్గించుటకై ప్రభుత్వమువారు వాగ్దానము గావించియున్నారు. అది సత్వరముగా అమలుకు తెచ్చుటకై ప్రయత్నింపవలసియున్నది.

### రైతుసమస్య

మనదివ్యవసాయదేశము మన ముత్పత్తి గావించుసంపదయందు ఇంచుమించుగా అంతయును వ్యవసాయవృత్తికి జెందినట్టిదే- జనసంఖ్యలోని నూటికిడెబ్బదిభాగములు వ్యవసాయవృత్తిపైని ప్రత్యక్షముగా ఆధారపడువారే- ఇతరులు కూడా పరోక్షముగా రైతుపైనవాధారపడి జీవించువారే- రైతు దేశమునందలి సంపద యంతయు ఉత్పత్తి జేయుచున్నప్పటికిని, అధికభాగము ఇతరు లనుభవించుటచే ఆతని భాగముఒకు దారిద్ర్యమేమిగులుచున్నది. ఆసంఘముయొక్క ఆర్థికభారమంతయు ఇదివరకే బలహీనమైయున్న అతనిభుజములమీదబడుటచే అతడుకృశించిపోవుచున్నాడు. ప్రభుత్వమువారు వసూలుజేయుపన్నులు, ప్రభుత్వోద్యోగుల అధికవేతనాలు, పెట్టుబడిదారు అనుభవించుఅధికడ్డీలు, జాగీర్దార్లవైభవములు, లక్ష్మీపుత్రుల సౌఖ్యములు, విద్యాధికులవిజ్ఞానము. ఇవిఅన్నియును ఎట్లుకలుగుచున్నవో ఆలోచించండి అన్నియును కృషికునిపాటువను మారురూపులుగావా? నేడుదేశమునందు రైతుయొక్క-దారిద్ర్యసమస్యయే ముఖ్యాతిముఖ్యమగుసమస్య

పారిశ్రామికవిప్లవ (Industrial revolution)ఫలితముగా పూర్వము మన దేశమందుండు గృహపరిశ్రమలు పెద్దపరిశ్రమచే పోటీజేయజాలకనశించియిపోనవి. గృహపరిశ్రమలస్థానము నలంబించుటకు వేరేపరిశ్రమలు నెలకొల్పబడలేదు జనసంఖ్యలోనెక్కువభాగము వ్యవసాయముపైనధారపడవలసివచ్చినది ౧౯౨౧సంవత్సరమున వ్యవసాయముపైజనసంఖ్యలో నూటికి౫౬భాగములుమాత్రమే ఆధారపడువారుండిరి రాయలుకమీషనాఫ్ అగ్రికల్చరువారిఅభిప్రాయానుసారము ప్రతిశతి౭౨గురు గతదశాబ్దమునందే వ్యవసాయముపై మనదేశమునందాధారపడుచున్నారు. పరిశ్రమలాభివృద్ధిబొందినయూరపుదేశములయందు ఈవిషయములు తలక్రిందుగాజరిగినది ౧౮౮౨నుండి ౧౯౧౫వరకు జర్మనీదేశమునందువ్యవసాయముపై ఆధారపడువారిసంఖ్య నూటికి౪౧నుండి౩౫వరకు తగ్గినది-

భూమిని అభివృద్ధిజేయుశక్తి రైతుయొద్దబొత్తిగాలేకుండబోవుచున్నది. వంశపరంపరగా రైతుబుణబాధవిపరీతముగా పెరుగుచున్నది.

షాహుకారుడు ముప్పదింతవరకు మనరాష్ట్రమునందు నూటికిరెండువందలవంతున (౨౦౦%)మితిమీరి (Compound interest)వసూలుగావింపబడుచున్నది ఎందరోబీదరైతులభూములు పెట్టుబడిదార్ల హస్తగతమైపోవుచున్నవి.

ప్రభుత్వమువారు వ్యవసాయశాఖపైవ్యయము గావించుమొత్తము మిగులస్వల్పము. ఈస్వల్పవ్యయముగూడా సరియైనఉపయోగమునకు వచ్చుటలేదు. లక్షలకొలదివ్యవసాయదారులకు ఇట్టిదొకశాఖ ఏర్పడియున్నదనువిషయమే తెలియదు.

ప్రభుత్వమువారి భూమిపన్నువిధానము రైతుకనుకూలముగాలేదు. ఖుష్కీపన్ను ఎక్కువగానున్నది. తరీపన్ను తెలంగాణమునందు విపరీతముగానున్నది. కొన్నిప్రదేశములయందు ఎకరమునకు౨౫రూపాయీలవరకుగూడానున్నట్లు ప్రభుత్వమువారినివేదికానుసారమే తెలియుచున్నది. బావుల క్రిందభూములపన్ను అన్యాయమై, దుర్భరముగానున్నది.

పన్నునిర్ణయవిధానము నియమబద్ధమైనదికాదు. ఉత్పత్తికర్చులుబోగా రైతుకుమిగిలినలాభములో ప్రభుత్వమువారుఅరవభాగము గైకొనవలయును. పూర్వముషటులనేజరుగుచుండెడిదనిచరిత్రచాటుచున్నవి.

ప్రభుత్వమువారు రైతులకొసగుతఖావీమొత్తములుగూడా రైతులకు లాభదాయకముగాలేదు- కొద్దిమొత్తములో తఖావీమొత్తములభించినప్పటికి అవిమిగులస్వల్పముగానుండుటచే రైతుఅవసరములనుదీర్పజాలవు మనమాల్గుజారిశాఖలో లంచగొండితనముండుటచే, రైతుతనతఖావీగాలభించుమొత్తములోనుండి కొంతభాగము లంచములకొరకును, పైరవీవ్యయమునకును మొదలైనకర్చుచేయవలసియుండును ప్రభుత్వమువారు మొన్నమొన్ననే రైతులలాభమునకై కొన్నిచట్టములుజేసియున్నారు- వాటికిమనవేదికనుండి మనము స్వాగతమొసగుచున్నాము

నేనుప్రప్రథమున నే మనవిజేసినట్లు రైతుయొక్క-దారిద్ర్యసమస్యయేమనలను, మనప్రభుత్వమునుఎదిరించుచున్న ముఖ్యాతిముఖ్యమగుసమస్య నేటిపరిపాలనావిధానముమారనిదే ఈసమస్యాపరిష్కారము గాజాలదనునమ్మకము నాకోటివారికొందరికోకలదు. నేటిపరిపాలనావిధానమును సమర్థించువారు మొదటఈసమస్యాపరిష్కారమును త్వరగానొనర్చి నాకోటివారినమ్మకము తప్పుఅని నిరూపించినచో నేనుసంతోషించెదను.

ఇరువదిహరింపబడిన కనీసపుకోర్కెలు మనమునవసంస్థనిర్మాణకార్యక్రమముద్వారా పొందుటకు తీవ్రముగకృషిసలుపవలసియుండును -

౧. (అ) మనరాష్ట్రమునం దాచరణలోనున్న తరీపన్నువిధానమే చాలాలోపభూయిష్టమును. కఠినమునైయుండ మామిక్కిలిబిలావర్థుపడావాలు, నీవాయిజనూబందీఉ గ్రామోద్యోగులు. గిర్దావరు మొదలగు తచ్ఛాఖోద్యోగులచే రైతులపైకసిదీర్చుకొనుటకు ఆయుధములుగాఉపయోగపడుచున్నవి తరీపన్నునిర్ణయవిధానములో మద్రాసురాజధానినిఅనుకరించుట చాలాఉత్తమము నీరుసమృద్ధిగాదొరకుచోట, భూమిపైశాశ్వత ఖుష్కీ పన్నునిర్ణయించి, నీటిఉపయోగముపై నీటిపన్నువిధింపబడవలయును దీనివలనరైతుకుండేజమాబందికష్టములు చాలావరకుయూడేరును-

(ఆ) మనరాష్ట్రములోని భూములుపరిసర బ్రిటిషుప్రాంతముల భూములకన్న సారహీనమైనవైనను పన్నుమాత్రము హెచ్చుగనేయున్నది. కాబట్టితరీపన్నుకనీసము సగమునకైనతగ్గించబడవలయును. ఎంతటిఉత్తమక్షేత్రమభూమిపైనను, ఎట్టిపరిస్థితులయందును ఎక్కువలోఎక్కువ ఎనిమిదిరూపాయీలు విధించినచాలును

(ఇ) ఖుష్కీభూములపై ప్రస్తుతమున్నపన్నులో మూడోవంతైనను తగ్గింపబడవలయును.

(ఈ) ప్రాత, క్రొత్త, అందరూ ఆయాకట్, బేరూ అయాకట్ అనుభేదములను పాటింపక, ప్రతిబావిపొలపుపరిసరభూఖుష్కీ భూమిధారాయే తీసుకొనవలయును.

(ఉ) ప్రాజెక్టులవలన రైతుయొక్క క్రమఫలితముగ లేపాగునుగనుక వీనిక్రిందితరీభూములపై ఉత్తమఖుష్కీధారామాత్రమే తీసుకొనవలయును.

౨. రైతునకువ్యవసాయోత్పత్తి వృద్ధిజేసుకొనుటకు అన్నివిధములైనహక్కు లుండవలయును. ప్రభుత్వాజ్ఞతోపనిలేకయే, పట్టాభూములలో చెరువులు, కుంటలు, బావులు, నిర్మించుకొనుటకును, ప్రాజెక్టులవలన తోడుకొనుటకును అధికారము లుండవలెను,

౩. ప్రభుత్వమువారు ప్రతియిరువది, ముప్పది సంవత్సరములకు బందోబస్తుచేయు విధానముచే రైతుపైపడుపన్నుఅధిక్యతనుండిఆతడువిముక్తిపొందుటకై శాశ్వతబందోబస్తువిధాన మవలంబించుట అవసరము-

౪. పట్టాభూములలోఉండే అడవులైనను రైతునకుసంపూర్ణాధికార ముండవలయును. అబ్కారిచెట్లనుండికల్లు, సారాయి తీయించుకొను అధికారముతప్ప చెట్లనుపెంచుటకు, కొట్టివేయుటకు మద్రాసురాజధానియందమలులోనున్న శిష్టముప్రకారమే రైతుకుహక్కుండవలయును,

౫. వ్యవసాయపనిముట్ల కవసరమగుపరికరపు అడవులనుండిరైతులకుచితముగా లభించవలయును. బీదరైతులకుగృహనిర్మాణమునకవలయు కలపకూడాఉచితముగా లభించవలయును. అడవులలోనుండేకంచెలు [పచ్చికబైళ్లు] మేయుటకు మాదురైతుపశువులకై ఉచితముగావదిలి వేయవలయును

౬. భూమినుంతఖిల్ చేయు పద్ధతులుచాలా వ్యయములతోగూడుకొనియున్నవి. గనుక ప్రభుత్వమువారు మదరాసురాజధానిలోనివిధానాన్ని అనుకరించవలయును-

రైతుబుణబాధవలన కృంగికృశించి పోవుచున్నాడు. కాబట్టిప్రభుత్వమువారు తీవ్రంగాఅలోచించిప్రస్తుతమందు బుణబాధానివారణోపాయములనన్వేషించుటయేగాక, తక్కువవడ్డీతో ఎక్కువకాలముకై రైతుఅవసరములు తీర్చునంత మొత్తములిచ్చుప్రభుత్వ బాంకులు స్థాపింపబడవలయును.

వ్యవసాయశాఖ రైతుఅభివృద్ధి దృష్టియందుంచుకొని, శ్రేయోదాయక పద్ధతులపై సంస్కరింపబడవలయును.

కౌలుదార్లహక్కులను రక్షించుచట్టమును ప్రభుత్వవారువెంటనే శాసించవలయును.

(అ). జాగీర్లలోనిభూమిపన్ను ఖాల్సాలోకతెనేఉండవలయును. ఎక్కువలోఎక్కువ మూడుసంవత్సరముల కాలములో ఖాల్సాప్రభుత్వమువారిప్రత్యేకశ్రద్ధపై బందోబస్తువ్యయములు రైతుపైమోపబడక, జాగీర్దారేభరించునట్లుచేసి, మూడుసంవత్సరములలోపలబందోబస్తుజరుగకపోయినచో ప్రభుత్వమువారు కఠినచర్య గైకొనవలయును.

(ఆ): జాగీర్లలోనిఅక్రమపన్నులన్నియు తక్షణమేరద్దుచేయబడవలయును

(ఇ): జాగీర్దార్లనుండబ డేపోలీసు, న్యాయ, అదాలతుఅధికారాలు ప్రభుత్వపరమైయుండవలయును,

(ఈ): జాగీరుప్రజాహిత కార్యములు యమజాగీర్దారునుండే గైకొని, ఖాల్సాలోవలెనె ప్రభుత్వమే వ్యయము చేయించవలయును.

### పౌరస్వత్వములు

ప్రభుత్వమువారు పౌరస్వత్వములగురించి అభివృద్ధికరమగు విధానమవలంబించుటలేదు. సభలసమావేశపరచుటకు నేటికిప్రభుత్వాజ్ఞ గైకొనవలసినిర్బంధము అమలులోనేయున్నది. సభలకాజ్ఞనొసగుటయందు పదిసంవత్సరముల క్రితమే విధానమాచరణయందుండెనో నేడుకూడాఅదే యున్నవి, సుప్రసిద్ధమగుసిబాసు (౫౩) గస్తీనిశానుతోనొనసకని మనకురొమ్ములపుడును గనకరచుచునేయుంటుంది. ఆజ్ఞనొసగబడినసభలనునరకులువిధింపబడుచునే యున్నవి. మొదటివరవది జేసినటులనల్లగొండ, వరంగల్లుజిల్లాల మహాసభల కుప్రభుత్వమువారు విధించినషరతులు చాలావిచిత్రముగానూ విపరీతముగానుండుటచే మనమాసభలనుసమావేశపరుప నిరాకరించితిమి, ఉపన్యాసకులనుజ్ఞనొసగుచు రాష్ట్రేతరులుఅధ్యక్షత వహించగూడదనియు, మహాసభలలోరాష్ట్రేతరులు ఉపన్యసింపగూడదనియు షరతులువిధింపబడినవి. ప్రభుత్వమువారిచర్య సహేతుకముగాలేదు. రాష్ట్రేతరులను ప్రభుత్వోద్యోగములలో

౧౦ వ పేజి చూడుడు

# క్రీటులో బ్రిటిషుసేనలు క్రొత్తచోట్లకు పోవుట

## లిబియాలో సోలంపదలుట

క్రీటులోయుద్ధము ఇంకను చాలఘోరముగ జరుగుచున్నది. జర్మనుసేనలు పారషూటిస్టులు విమానములలోనుండి వందలకొలది క్రీటులో దిగుచునేయున్నవి! కొన్ని జర్మనుసేనలు చిన్నచిన్న గ్రీకుఓడలలో వచ్చిదిగినవి. ఇపుడు 30000 మంది జర్మనుసైనికులైతే కృష్టంగా క్రీటులో చేరియున్నారనియు, అంతకుమించి వారలలెక్క చెప్పవీలులేదనియు, జర్మనుసేనలసంఖ్య, ఒత్తిడి బ్రిటిషుసేనలవాటికంటె చాల ఎక్కువైనదనియు బ్రిటిషుప్రభుత్వపత్రపు ప్రకటనలు తెల్పుచున్నవి. అందువల్ల మే ౨౭ వతేదిన, జర్మనుసేనలు కానియాలో బ్రిటిషురక్షణస్థానములలోకి చొచ్చుకొనిపోగలిగెను. అందుపై బ్రిటిషుసేనలు వెనుకనుండే స్థానాలకుచేరెను. జర్మనులుకానియా నాక్రమించినామనుచున్నారు. ఈకానియా క్రీటుయొక్క ముఖ్యపట్టణము మే ౨౮ వ తేదినాటికి బ్రిటిషుసేనలు సూడాబేకు తూర్పునుండే స్థానాలకుపోయినవి 30 వతేదినాటికి జర్మనుసేనలు హెరాక్లియనును పట్టుకొన్నట్లు ప్రకటించినవి రెథిమోలోకూడ కొన్నిజర్మనుసేనలున్నవని బ్రిటిషువారిప్రకటనలలోనున్నది.

మే ౨౦ వతేదిన జర్మనువిమానాలు క్రీటులో గ్రీకురాజుఉండేచోటిని గ్రీకుప్రధానిమంత్రిఉండేచోటిని ముట్టడించుటకు యత్నించినవి. అదితెలిసి, వారిరువురును బ్రిటిషుసైనికాధికారులసహాయంతో క్రీటులోనుండితేచిపోయినారు వారలు ఈజిప్టుకుచేరుకున్నారట. కొంచెం అజాగ్రత్తఅయిఉండినట్లయితే గ్రీకురాజుజర్మనులకు చిక్కిఉండెడివాడు. ఈకథను తెల్పిన బ్రిటిషుసైనికాధికారిఒకడు జర్మను బ్రిటిషు యూనిఫారములలోను, జర్మనుయూనిఫారములలోనువచ్చుచున్నారనగానే క్రీటులో చాలమంది భయపడుచుండిరనిచెప్పినాడు. క్రీటులో ఇప్పటికిని కొందరుగ్రీకుమంత్రులున్నారు. క్రీటులో బ్రిటిషుస్థలాలపై జర్మనులను జర్మనులపై బ్రిటిషువారును విమానాలనుండి బాంబులనువేయుచునేయున్నారు. మే ౨౮ వతేదిన కానియాలోను రెథిమోలోను, హెరాక్లియన్‌లోను బ్రిటిషువిమానాలుండినందువల్ల జర్మనులు బాంబులనువేసిరి. ఈదాడి చాలఘోరంగానుండెనట. బ్రిటిషువిమానాలు మే ౨౮ వతేదిన మాలెమివద్ద సేనలనుమోయు విమానాలను పదునాల్గింటిని ధ్వంసముచేసినవి మరికొన్నిటికి దెబ్బలనువేసినవి, ౨౯ వతేదిరాత్రి మాలెమిలో ఒక పెద్ద విమాన మిస్లీధ్వంసమైనది, ఆనాటిపగలుఅక్కడనే ఒక జర్మనువిమానముధ్వంసమైనది. బ్రిటిషువిమానములొకటిజర్మనువిమానాల యెదుర్కొనుటలో ధ్వంసమైనది. ౨౯ వతేదిరాత్రి ౩౦వతేదిమొత్తము ౨౮జర్మను విమానాలను ధ్వంసము చేసినవి. ౩౧ వతేదిని జర్మనుసేనలుండిన జర్మనువిమానాలు మాలెమివద్దకూల్చబడినవి ఈపోరాటంలోరజర్మనువిమానాలు కనిపించలేదు. ౩౧వతేదినాడుకూడ మాలెమివద్దనుండిన అనేకజర్మనువిమానాలపై బ్రిటిషువిమానాలు బాంబులనువేసిధ్వంసముచేసినవి—ఆనాటిరాత్రి ౧౫జర్మనువిమానాలు ధ్వంసముచేయబడినవి. ౨౮ వతేదినమాలెమివద్దను, క్రీటుసముద్రతీరప్రదేశాలమీదను బ్రిటిషు విమానాలదాడు లతీవ్రముగాయుండెను.

నౌకలనష్టములుకూడ గమనించదగియున్నవి. క్రీటువద్దసముద్రంలో జర్మనుల, ఇటాలియనునౌకలుఎదుర్కొనటచే బ్రిటిషునౌకలు తమయూలస్థానాలకుపోవలసివచ్చెనని మే ౩౧ వతారీకున ఇటాలియుప్రభుత్వమువారు ప్రకటించినారు. తూర్పుమధ్యధరాసముద్రంలో బ్రిటిషునౌకలుజర్మనుసైనికులుండినరెండుచిన్నగ్రీకునౌకలను ముంచివేసినవి. రెండుయూబోటులుగూడమునిగినవి. మరిరెండుజర్మనుయూబోటులుదెబ్బలనుతినినవి ఈదెబ్బలనువేయుటలో ౨ బ్రిటిషుయుద్ధనౌకలుమునిగిపోయినవి.

### సైప్రస్‌లో బ్రిటిషుసేనల హెచ్చింపు

క్రీటుతర్వాత సిరియామీదికిని, అక్కడినుండి భారతదేశంమీదికిని జర్మనులురాగలరనితలచి బ్రిటిషువారు ఈమార్గంలోఉండే మొదటిస్థావరముగు సైప్రసులో తమసేనలిపుడు ఎక్కువగాచేర్చుచున్నారు.

కానిన్యూజిలాండులో ఇపుడు తాత్కాలిక ప్రధానమంత్రిగానున్న నాష్‌గారు క్రీటుతర్వాత జర్మనులు బ్రిటనుపైదండెత్తుటకు యత్నించగలరనుచున్నారు. అసలుక్రీటుపైయుదమును జర్మనులు జేసినది బ్రిటనుపైదాడికగలమార్గమేమాయని పరీక్షించుకొనుటకేయని కొన్నిపత్రికలవారలఊహ.

### ఇరాఖు వ్యవహారము

ఇరాఖులోనుండి రషీదలీగారిసామానులు కొన్నితుర్కీలోని అంకారాలోకిచేరినందువల్ల రషీదలీగారు అంకారాకుపోవచ్చునని కొందరు ఊహించుచున్నారు. కానిఇదినిజమనిధ్రువపడలేదు బ్రిటిషుసేనలిపుడు బాగ్దాదునగరముపైకిత్రోసికొనివచ్చుచుండ, రషీదలీగారిసేనలువాటినాటంకపరచుటకై రోడ్లమీదికిప్రవాహములను మళ్ళించినారు. హబ్బానియాకు౨౦మైళ్ళ వాయవ్యదిశలో ఉండే రామాదివద్ద ఇరాఖుసేనలస్థానములపై బ్రిటిషుసేనలు దెబ్బలుతీయుచున్నవి రామాదిలో ఈరాఖులప్రతిఘటనలు అణచనంతవరకు బ్రిటిషువారిభూమార్గమునకు గొప్పఆటంకముఉండగలదు బ్రిటిషువారు ఇరాఖులో బ్రిటిషువారు అమెరికానుండివచ్చినవిమానముల నుపయోగించుచున్నారు, ఇప్రుడుఅంకారాలోఉండే జర్మనులుకొందరు ఇరాఖులోరషీదలీచర్యకు ఇదిసమయముకాదనిచెప్పుచున్నారు.

సిరియాలోకి జర్మనులింకను వచ్చుచునే యున్నారు. కానిక్రీటుయుద్ధంలోవారలకు పనిఎక్కువగాఉన్నందువల్ల పూర్వంవలెఎక్కువమందిరావడంలేదు, సిరియాలోనిజర్మనువిమానాలు దిగియున్న లాయక్, పల్మైరా, డిమాస్కస్ అనుస్థానములపై బ్రిటిషువిమానములుబాంబులనువేయుచునేయున్నవి. ఇరాఖుకుటాంకులను తీసికొనిపోవుచుండు మూడురైలుబండ్లపై బ్రిటిషువిమానములు తీవ్రముగాబాంబులనువేసినవి. ఇదివరలో సిరియానుండి బ్రిటిషురాయబారులను లేచిపోవలసినదని అక్కడి ఫ్రెంచిఅధికారులు కోరియుండిరిగదా! దానికిప్రతిక్రియగా బ్రిటిషువారు పాలెస్టైనునుండి ఫ్రెంచిరాయబారులను లేచిపోవలసినదని కోరినారు. ఆదేప్రకారముఫ్రెంచివారు లేచిపోయినారు. జర్మనులుసిరియానుబలాత్కారముగ ఆక్రమించినచో తుర్కీవారుసిరియావ్యవహారమందు విధిగాజోక్యము కలిగించుకొనవలసివచ్చునని ఒక తుర్కీపత్రిక వ్రాసినది.

### ఆఫ్రికాలోయుద్ధము

ఆఫ్రికాలో సోలంనుతిరిగి బ్రిటిషుసేనలుకదలిపోయినవి, జర్మనుసేనలు హైఫాయాకనుమకు ఉత్తరదక్షిణముగా వ్యాపించియున్నవి— టోబ్రుకులో జర్మనుసేనలు మే ౨౭ వతేదిన కొంతముందుకు నడచిపోయినవి— బ్రిటిషుసేనలు కొంతవెనుకకుపోయినవి— అబిసీనియాలో డెస్సాటాబరులో ఇటాలియనుసేనలచుట్టును అబిసీనియాదేశభక్తదళమునకుచెందినసేనలు ముట్టుకొన్నవి- ఇది డెస్సీనుండి గోండారుకుపోవురోడ్డుపై సగందూరంలోనున్నది— డెబ్రామార్కాస్‌నుండి పోయినఏప్రిలులో తప్పించుకొని అడిస్అబాబాకు ఉత్తరానికిపోయిన ఒకఇటాలియసైనికదళమును నూదానులుపట్టుకొన్నారు— లేక్సుజిల్లాలో ఒక ఇటాలియసైనికుడివిజను బ్రిటిషువారికి లొంగినది

---

## ౭ వ ఆంధ్రమహాసభ

### చిలుకూరు

### రానుపోను ర్చ ర లు మాత్రమే

౨౮—30—31 తేది ౧౦ ఘ-మంగళ, బుధ, గురువారములలో చిలుకూరులో జరుగనున్న అష్టమాంధ్రమహాసభకుపోవువారికి హైద్రాబాదు స్థాయిసంఘకార్యాలయము (సుల్తానుబజా)నుండి రాకపోకలసౌకర్యార్థమై లోగడజరిగిన మహాసభలకేర్పాటుచేసినట్లే బస్సులకుమిక్కిలి తక్కువచార్జీలునిర్ణయింపబడినవి. ఈయవకాశమును బాగుగ వినియోగించి సోదరాంధ్రులందరును ౨౮ (తీరు)సోమవారం సాయంత్రం౬గంటలకు తుల్జాగూడెమునకువిచ్చేసి తమ టిక్కెట్లు కొనగలరు—

ఇట్లు
ఆంధ్రమహాసభ స్థాయిసంఘఅనుమతితో
బొజ్జం నరసింహులు
కాచిగూడ

---

## బొంబాయిలో అల్లరులు

బొంబాయినగరంలో మళ్లీఅల్లరులు మే ౨౨వ తేదిన లేచివిజృంభించినవి ఇ వరకు వ్యాపించని నగరఉత్తరభాగము మున్నగుచోట్లకు వ్యాపించినవి. పోలీసురక్షకులకాపలా చాలియుండలేదని జనులుఅనుకొనుచుండుటవల్ల సేన ౨౦ మే ౨౪వ తేదిన ఉదయము సేనలు పిలిపించబడినవి. నాటిరాత్రి జనసంచారమును చాలాకఠినముగానిరోధించుట వలన రాత్రిచల్లగా నేగడచెను. కాని ఒకచిన్న గందరగోళముజరిగెను. రాత్రి చాలా ప్రొద్దుపోయినతర్వాత ఒకచోట రాళ్ళువువ్వుచున్నారని వదంతిరాగా పోలీసులు ఒకలారీలో పోయిచూచునరికి అక్కడఏమియులేకుండెను— కానిఅలారీపైననే కొన్నిరాళ్ళుపడెనట— ౨౫వతేదిఉదయం నుండి౫గురిని కత్తితోపొడిచినారు, చిన్నదెబ్బలు తగిలినవారలున్నుగలరు. ఇదివరలో దెబ్బలుతగిలినవారలుఇద్దరు ౨౬వ తేదిన మరణించిరి. అల్లరులు తిరిగిప్రారంభమైననాటినుండి ౨౮మంది మరణించిరి. ౨౬వ తేదిన ఒకడుకాణముతగులబెట్టబడెను

---

## బ్రిటిషు నేవీసర్టులను జపాను గుర్తించదు

బ్రిటిషునేవీసర్టులను జపాను సిద్ధాంతమునకగానుగుర్తించదు,అని మే ౨౬వతేదిని విదేశాంగ సహాయమంత్రి ప్రతినిధిచెప్పెను—

గతవారం సాన్‌ఫ్రాన్సిస్కోలో బ్రిటిష్ ప్రకటనలో ప్రస్తావింపబడిన ౯౨ జపానునావలు "నేవీసర్టులనుకోరిన తద్వారా బ్రిటిషుఅధికారులతో సహకారమునర్పనందున" బ్లాకులిస్టులో చేర్పబడినవని అతడు తెలిపెను—౯౫ నావలకేగాక, నేవీసర్టులుకావలెనని బ్రిటిషు అధికారులకు దరఖాస్తుపెట్టుకొనని తక్కినఅన్ని జపానునావలకుకూడఅదేవర్తించునుఅని అతడుచెప్పెను

పసిఫిక్ మహాసముద్రంలోతిరిగే ౧౧పెద్దజపానుటాంకర్లు, ౫౧చిన్న నావలకు వ్యాపారంసాగించుటలో తమకుసాధ్యమైనన్ని ఆపోకర్యాలనుకలిగిస్తామని గతశుక్రవారమునాడు సాన్‌ఫ్రాన్సిస్కోలో బ్రిటిషు ప్రభుత్వంవారు ప్రకటించిరి. పసిఫిక్‌లోని జపానుటాంకర్లు జర్మను నావలను సూయెసరఫరాచేస్తున్నందున ఈచర్యతీసుకొనబడియుండవచ్చుననికూడ అమెరికావారన్నారు—

---



## ప్రకటన

ఖమ్మంమెట్టు మునసపు కోర్టునుంచి
ఫైలునెంబరు
(106) 1350 ఫ,
2

వాది- బండివెంకయ్య
ప్రతివాది- ఆనందరావు నాగమ్మ మొదలగువారు

(1) ఆనందరావు రామయ్యగారి భార్య నాగమ్మ కులం బ్రాహ్మణులు వయస్సు 65 సం॥రములు సాకిన్ గుంటూరు అరండల్‌పేట తా॥ గుంటూరు.
(2) పడకచర్ల శ్యాములాంబ తండ్రి అంజనేయులు. కులం బ్రాహ్మణులు వయస్సు (20) సం॥రములు సా॥ కొండాపురం హాలు గుంటూరు అరండల్‌పేట తా॥ గుంటూరు.

ఇందుమూలకంగా మీకు తెలియచేయడమేమనగా లోగడ అనేక పర్యాయములు మీపేర న్యాయస్థానమునుండి నోటీసులు పంపడమైంది. కాని మీపేర సర్వుకాలేదు. ఇప్పుడుమీరు స్వయంగా కాని లేకప్లీడరుద్వారాగాని వాయిదా చగర అమర్దాదు ౧౩౫౦ఫసలీ సరియైనది. ౧౯-౬-౪౧ తేదీన ఉదయము ౧౦ గంటలకుసదరున్యాయస్థానమునకు హాజరయి మీప్రత్యుత్తరమును విన్నవించుకొనగలరు. లేనిచో మీపరోక్షంలో లా ప్రకారం తంతు జరుపనగును. తదుపరి మీఆక్షేపణలు అంగీకరించ బడజాలవు.

సిరిస్తెదారు

---

# విదేశ వార్తలు

### అమెరికను పహారా నావల తనిఖీ

అమెరికనుయుద్ధనావలు అమెరికను కోస్తా సముద్రప్రాంతములలో పహారా తిరుగుచున్నవి. అట్లాంటిక్కు-సముద్రములోని అమెరికనుయుద్ధనావల నౌకాదళాధిపతిగా అడ్మిరలు కింగుగారు వ్యవహరించుచున్నారు. అమెరికను సైనికశాఖ కమిటీయొక్క-మంత్రివర్గములో రగురు మెంబర్లు రూజువెల్టుగారి సహచరులుగానున్నారు, అమెరికా ఖజానా కార్యదర్శియగు మార్గంథూగారు ఆకమిటీలో నిమంత్రితులు రగురిలో మేకులైయున్నారు మార్గంథూగారు అమెరికనుపహారా నావలను తనిఖీచేయుటకై వెళ్ళిరి.

### అమెరికను యుద్ధ నౌకాధిపతులకు క్రొత్త అధికారాలు

సముద్రప్రాంతంలో అన్నిదేశాలవారికినితమ నావలనునడుపుకొనుటకు హక్కు-కలదు. అట్టి అంతర్జాతీయ నౌకారహదారీ హక్కు-గల సముద్రప్రాంతాలలో అట్టిహక్కు-లను వీలవబెట్టుకొనుటకు అమెరికనుయుద్ధనావలకు అధికారమున్నది. అందువల్ల అట్టిసముద్ర ప్రాంతములలో తిరిగెడి అమెరికనుయుద్ధనావలలోని నౌకాధికారులెవరైనను, తమఅధికారమునుచెలాయించు ఉత్తరువులను జారీచేసినయెడల అట్టిఉత్తరువులను ఏ అమెరికనురహదారీనావయైనను ఉల్లంఘించినయెడల అట్టిఉత్తరువులను విఅమెరికనురహదారీనావయైనను ఉల్లంఘించినయెడల అట్టిఅమెరికనురహదారీనావయొక్క- ఉద్యోగులకు కఠినమైనశిక్షలు విధింపబడవలెను.

ఉదాహరణగా, ఏఅమెరికనుయుద్ధ నావయొక్క-పికానిదైనను తనస్వయంచితప్రకారముగ పరిస్థితులనుబట్టి ఉత్తరువుజారీచేయుటకధికారముకలిగియుండవలెను. అట్టి ఉత్తరువును అమెరికను నావలు శిరసావహించితీరవలెను. ఇందుకొరకై ఒకచట్టమును అమెరికాశాసన సభవారు శాసించవలెను" అని అమెరికా నౌకాశాఖాకార్యదర్శియగు కర్నలునాక్సుగారు కోరుచున్నారు.

### ఒకచిన్న బ్రిటిషునావ మునిగిపోయెను

మే-౨౫వతేదిన ఒకచిన్నబ్రిటిషునావముంచబడినది. కొంతజననష్టంకలిగినది.

### అమెరికాకు జర్మనునౌకాధిపతి హెచ్చరిక

"కొలంబస్" అను జర్మనునావ, మరికొన్ని జర్మనువర్తకనావలు ఉత్తరఅట్లాంటిక్‌లో అమెరికానావలుగ స్త్రీతిరుగుటవల్ల బ్రిటిషువారికిబలియైనవని జర్మనునౌకాదళాధిపతి గ్రాండ్ అడ్మిరల్ రేడరు తెలిపెను. అమెరికావైఖరిని జర్మనునౌకాశాఖవారు చాలాతీవ్రముగావిమర్శిస్తున్నారని అడ్మిరల్ రేడరుచెప్పెను. తాటస్థ్యము, దురాక్రమణ, యుద్ధము-ఈమూడింటికినిభేదమును లేకుండజేయుటకు అమెరికా సాధ్యమైనదంతయు చేయుచున్నదనితడనెను,

అమెరికను నావలు బ్రిటిషువారికిపంపెడియుద్ధసామగ్రికిరక్షణగాపోవుట స్పష్టమైనయుద్ధచర్య జర్మనీపైఅకారణమైన దౌర్జన్యము అని అతడుచెప్పెను. జర్మనుయుద్ధనావలు తమహక్కు-చలాయించుటకు అమెరికనుయుద్ధనావలు అడ్డుపడినచో, అవసరమైనచో ఆజర్మనుయుద్ధనావలుబలప్రయోగము చేయును.

ఉత్తరఅట్లాంటిక్‌లో అమెరికనుగస్తీ నావల వల్ల 'కొలంబస్' మరికొన్ని జర్మనువర్తకనావలు బ్రిటిషువారికిబలియైనవి. జర్మనుయుద్ధనావఫలానిచోటనున్నదని బ్రిటిషునౌకాశాఖవారికి అమెరికనుయుద్ధనావ తెలిపినట్లైనను, ఆజర్మనుయుద్ధనావ నాయకుడుచూస్తూఊరకుండునని ఎవరునుఅనుకొనరు. అట్లుతెలుపుట యుద్ధచర్యగాభావించకతప్పదు. అట్టినావలను విరుద్ధచర్యలుమానునట్లుచేయుటకు జర్మనునాయకుడు బలప్రయోగించినచో అది న్యాయమేఅని గ్రాండ్ అడ్మిరల్ రేడరు తెలిపెను.

### ఆస్ట్రేలియా-నెదర్లాండ్సు ఇండీసుల సహకారము

ఆస్ట్రేలియా నెదర్లాండ్సుఇండీసుల సహకారమెంతఅవసరమో స్పష్టముచేయుచు శత్రువులకుపయోగపడగల ప్రతినావనుగాని, ప్రతిఫ్యాక్టరీని, ప్రతిస్టోరునుమేము నాశనము చేయుదుము- అని డచ్చిండీసు ప్రచురణశాఖాధికారి లిట్ మన్ గారు ప్రకటించిరి. ఆస్ట్రేలియాకును, ఈస్టిండీసుకును మధ్యభాగమెక్కడుచో జర్మనులు ఈప్రాంతములోనికిప్రవేశింపకుండచేయుట చాలఅవసరము అగునని అయనచెప్పెను. ఇతరదేశములు మాకుసహాయముజేసినను చేయకపోయినను మేముపోరాడెదము అని అయన చెప్పెను.

### ఉత్తరసముద్రములో జర్మనునావ ముంచుట

మే-౨౮వతేది ఉత్తరసముద్రములో రెండుశత్రునావలపై బ్రిటిషువిమానములుదెబ్బతీసినవి, ఒకటి మునిగిపోయినదనినమ్ముచున్నారు రెండవదిఒకపైపునకుఒరిగిపోవుచుండెను. మరికొన్ని నావలపైన బాంబులువేయబడినవి. మరఫిరంగులుప్రయోగించబడినవి. వెళ్లినబ్రిటిషువిమానములలో ఒకటితిరిగి రాలేదు.

### గ్రీసు యుద్ధంలో న్యూజిలాండు సేన నష్టము

గ్రీసుయుద్ధంలో ౨౨౨౦మంది న్యూజిలాండు సైనికులకనబడుటలేదుట ఆసైనికులు గ్రీసులో లేరు. ఈజిప్టులోలేరు అందువల్లవారియుద్ధఖైదీలుగానున్నారనిచాలావరకు అనుకొనవలసియున్నదని న్యూజీలాండుప్రభుత్వానికి కొంచెంనమ్మకంగా తెలిసినది

### పట్టుకొనబడిన జర్మనునావలు ప్రయాణాలకు వినియోగించబడుట

పట్టుకొనబడిన; జర్మనునావలతో మెక్సికోరేవులకు, హవానా, న్యూయార్కు-మధ్య రాకపోకలునడుపుటకు మెక్సికోప్రభుత్వంవారియాజమాన్యమున ఒకకంపెనీవెరాక్రూజులో స్థాపింపబడినది

### ఇటాలీయనౌక మునుగుట

మధ్యధరాసముద్రతూర్పుభాగములో ఒక ఇటాలీయనడిస్ట్రాయరు, ఒకటార్పిడోబోటుమునిగినది

### బ్రిటనుపై జర్మను విమానాల దాడులు

బ్రిటనుపై జర్మనువిమానాలు మే-౨౫వతేది నుండి ౨౮వతేదివరకుచెప్పదగినదాడులు చేమియుచేయలేదు, మేం-౨౫వతేదిన ఇంగ్లీషుఛానల్‌పై జర్మనువిమానములు నాశనముజేయబడినవి, బ్రిటిషు విమానాలు ... రాలేదు మే-౨౯వతేదికొద్దికొలది జరిగినదాడులలో గ్రీన్విచ్‌లోనిరాయల్ కాలేజి, "రాయల్ కాలేజ్ ఆఫ్ సర్జన్సు" అనుభవనములు నాశనమైనవి. మే-౨౯వతేదిపగలురాత్రికూడ బ్రిటనుపైవిమానాలదాడులులేవు మే ౩౦వతేది రాత్రికూడ బ్రిటనుపై దాడులులేవు ౩౧వతేదిఉదయమువచ్చిన కొద్దిజర్మనువిమానాలలో ఒకటిసముద్రంలోకూల్చబడెను మే ౩౧వతేదిరాత్రి మిడ్లాండుప్రాంతంలో కొన్నియిండ్లు పాడైనవి.

బ్రిటిషుఓడలలోకెల్ల చాలగొప్పదియు, ౯కోట్లరూపాయీలవిలువగలదియునగు 'హెచ్. యం. యస్ హుడ్' అను ఒకబ్రిటిషుయుద్ధనౌక గ్రీన్లెండుతీరమున నావలసముద్రంలోకొన్నిజర్మనుయుద్ధనౌకలను మరికొన్ని బ్రిటిషునౌకలసహాయంతో ఎదిరించిపోరాడుటలో ఒకమందుగనికితగిలి పేలినది, ఒకజర్మనునౌకదెబ్బతగిలినది బ్రిటిషునౌకలోనిసిబ్బందిలో చాలా కొద్దిమందిమాత్రమే జీవములతో తప్పించుకొనియుందురు

### అమెరికాకు ఫ్రెంచివారిహామీ

ఫ్రెంచియుద్ధనావలు, వలసరాజ్యములు జర్మనీకిగాని, మరేరాజ్యమునకుగాని ఒప్పగించబడవు అని ఫ్రెంచిప్రభుత్వము వ్రాతమూలముగ మరల హామీనిచ్చినది. అమెరికాలో ఫ్రెంచిరాయబారి హెన్రీ హేయిగారు స్పష్టమైన గ్యారంటీపత్రము అమెరికాసహాయమంత్రి అయినసమ్నరు వెల్సుగారికి మే-౨౭వతేదిన అందిజేసినారు విషీనుండివచ్చిన ఆజ్ఞలప్రకారము, ఫ్రాన్సుజర్మనీల సహకారవృద్ధినిగురించి అమెరికాలోకలిగిన అపోహలను తొలగించుటకు తాను ఒకలేఖనకలును తయారుజేసినట్లు హేయిగారు పత్రికాప్రతినిధులతోతెలిపిరి.

విషీలో హిట్లరుపక్షంవారు సర్వాధికారంలోలేరని ప్రపంచమును నమ్మింపదలచితే తమస్థితినిస్పష్టంగా, వాగమూలంగా తెలియజేయవలసినదని గతివారం కార్డెలుహల్లుగారు విషీనిక్షోరినదానికి అనుగుణంగ విచీప్రభుత్వము ఇట్లుచేసినటున్నది

పూర్తివివరములను తెలుపుటకు హేయిని రాకరించెనుకాని ఇట్లనెను "ఫ్రాన్సు అమెరికాసంబంధములను తబ్బిబ్బుచేయుటకుయత్నించుచున్న వారికిది ఆశాభంగము కలిగించగలదు"

"విన్నీపెగు" అనే ఫ్రెంచినావను తటస్థప్రాంతములోని కరిబియన్సముద్రములో బ్రిటిషుయుద్ధనావలు అటకాయించినవి నిషిద్ధపదార్థములుండునని సోదాజేసినవా లేక, బ్రిటిషువారు ఆఫ్రెంచినావను పట్టుకొనిరాయనువిషయం తెలుపవలసినదని అమెరికావారిని అడిగినటుల హేయి చెప్పెను.

### అడ్మిరల్ డార్లాను పారిసుకు వెల్లుట

అడ్మిరల్ డార్లాను మే ౨౮వతేదీన పారిసుచేరెను జర్మనీతో "టెక్నికల్ విషయము"లలో రాయబారములు నడపవలెనుఅని అంటున్నారు విషీఖజానామంత్రి బౌధిల్లియరు, యుద్ధమంత్రిహంట్జిగరు, సేనాని వ్యవసాయమంత్రికాజియాటు ఇప్పటికే పారిసులోనున్నారట.

### ఆచరణఎప్పుడు

రూజ్వెల్టుగారు ఉపన్యసించినతర్వాత మిగిలిపోయిన కొన్నిసంగతులగురించి స్పష్టపరచుటకై మే ౨౮వతేదిన పత్రికాసమావేశసభ జరిపిరి.

తాటస్థ్యచట్టమును రద్దుచేయవలెనని కోరదలచలేదు. దానినిసవరించుటనుగురించి ఆలోచించుటలేదు. గొప్పజాతీయావిపత్తునుగురించి చేసినప్రకటనను అమలుపెట్టుటకు ప్రస్తుతము కార్యాచరణఉత్తరువులను జారీజేయవలచుటలేదు- అని రూజ్వెల్టుగారు తెలిపిరి. అట్టిఉత్తరువులు జారీచేయనిదే ప్రకటనవలన కలిగినఅధికారముక్రింద చర్యతీసుకొనవీలులేదు.

---



## కావలెను

మెట్రిక్యులేషన్ పరీక్షకుప్రైవేటుగా చదివి హైద్రాబాదులోజరుగు పరీక్షలకు కూర్చొనువారు కావలెను. ఆడవారు మగవారుకూడ తయారుచేయబడుదురు, ఈ నెల 15 వరకే తీసుకొనబడుదురు. జీతము నెలకు రూ. 5/- భోజనవసతికూడ కలదు. వివరములకు,

పాపులర్ కెమిస్ట్సు-
కె ఇ, యం, హాస్పిటల్ ఎదుట సికింద్రాబాదు

# మహారాష్ట్ర మహాసభ

## వైద్యాగారి అధ్యక్షోపన్యాసము

బీరారు ప్రజల కిత్తుమన్న మేరకైనను హైదరాబాదు ప్రజలకియ్యవలెను.

బాధ్యతాయుత ప్రభుత్వము తప్పక సిద్ధించును

రోహిలాల వడ్డీ వారికి కోర్టుకన్న లాఠీయే సహాయకారి

హైదరాబాదురాష్ట్రములోని మరట్వాడాను నాందేడుజిల్లాలో ఉమ్రీఅనుస్థలములో నిజాం రాజ్యమహారాష్ట్ర మహాసభా కాశీనాధరావు వైద్యాగారిఅధ్యక్షతలో ౨౯,౩౦ ౩౧ మేనెలతేదీలలోజరిగెను-సభకు సమారు ౩౦౦౦మంది వెళ్లియుండిరి-అత్యంతోత్సాహముతో సభాచర్యలు జరిగెను-మతపాఠీకము పూర్తిగా నిషేధింపబడియుండెను-అన్నికర్గాలవారును అందు పాల్గొనిరి.

కాశీనాధరావు వైద్యాగారు తమ అధ్యక్షోపన్యాసమును ఈక్రిందివిధముగా ఇచ్చిరి-

"మనమీనాడు నిరాశాజనకమగు వాతావరణములో కలియుచున్నాము. ఈ మహాసభలో మంచిశ్రద్ధతీసుకొన్న మనమిత్రులుకొందరు ఇచ్చటకానరారు-స్వామీ రామతీర్థగారును వారి మిత్రులును ఈనాడిచ్చటలేకపోయిరి- ప్రాథమిక స్వత్వములపైకల నిర్బంధాలను వారు సహించజాలకపోయిరి- అందుచే వారు సత్యాగ్రహము చేసిరి వీరిరామాపాలనండి కృష్ణ మందిరములో తపస్సు చేయుచున్నారు. వారిత్యాగముచాలా గొప్పది- వారికిమనము ధన్యవాదాలిచ్చుకొనుచున్నాము-ఈవర్గములో గోవిందదాసుజీ, సయ్యద్ హబీబుద్దీన్ వాఘ్మారే, వైశంపాయనుడు, పాఠకుగారలు జయిలులో కేయబడినారు విఠలరావు దేశపాండే, రత్తీలాల్జీ, యల్లారెడ్డి దాదాసాహెబు వైశకర్ గారలు దిగ్బంధనంలో నిరోధింపబడినారు- వారిని ప్రభుత్వమువారు విచారించదలైన విచారించవలెను, లేదా దిగ్బంధనం తొలగించవలెను-

ఈమహారాష్ట్రము దేశము మహావీరులకు. మతబోధకులకు, యోగులకు వేదాంతులకు జన్మస్థానము-శివాజీ. రామదాసుల దేశము-

౧౯౩౭ మనము మొదటిసారి లాతూరులో సమావేశమైతిమి-కాని అచ్చటిఅధికారి అడ్డంకులుపెట్టుటచేత సభను మధ్యలో నిలిపితిమి-అప్పుడు మీలోచాలామంది అడ్డంకులను ప్రతిఘటింపగోరితిరికాని అదమకాదని ఆగిపోతిమి- తర్వాత సత్యాగ్రహోద్యమములో జరిగెను- మేముకోరినదంతయుఅభ్యముకాలేదు నిజమే- గాని మాకోరికలబలిష్ఠతను ప్రభుత్వమువారికి చూపుట కదొక పద్ధతియై యుండెను-

మనప్రభుత్వమువారు చాలామెల్లగా పనిచేయుచున్నారు- ప్రభుత్వమువారు జూలై ౧౯౩౯లో రాజ్యాంగశాసనమును ప్రకటించిరికానియింతవరకుమన మెక్కడనుంటిమో అక్కడనే యున్నాము-వాక్స్వాతంత్ర్య నిరోధ మట్లేఉన్నది-పత్రికాస్వాతంత్ర్యనిరోధ మట్లేఉన్నది, ఖాస్గీబళ్లపై ఆంక్షలట్లేయున్నవి- అఖాడాల శాసనము స్థిరపరుపబడాల్చినవి- ప్రజాసంరక్షకశాసనము. తాత్కాలికమనిచెప్పి యిప్పటికిని దానికి స్థిరరూపమిచ్చినారు. వీటినితీసివేయునట్లుగా ప్రజలు సక్రమాందోళనము చేయవలెను.

ప్రభుత్వమువారు ప్రకటించినరాజ్యాంగశాసనము అసమగ్రమేకాక అసంతృప్తికరమును, మరియుకొంతవరకు నష్టదాయకమును అయియున్నది బాధ్యతాయుతప్రభుత్వమునకది విరుద్ధము, బాటెహామీమతు సర్వతంత్ర స్వతంత్రముగా నేయుండును. శాసనసభకధికారాలు చాలాతక్కువ. ప్రపంచములో ప్రజాసత్తాకరాజ్యాలలో ఎచ్చటను లేనివర్గపద్ధతి యిచ్చటప్రవేశపెట్ట బడినది. మతకక్షలకు మంచిప్రాముఖ్యమిచ్చినారు. హిందువులకుసగము ముస్లిములకు సగముస్థానాలిచ్చినారు, ఇతరమతస్థులకు ఎన్నికలఅధికారములేదు, ఇకముందు మతోద్రేకాలుండేవారికే శాసనసభాస్థానాలు దొరకును వ్యవసాయకసభ్యులున్నారనమాటయేకాని వారికి సంబంధించినచర్చలు చేయుటకు శాసనసభ కధికారములేదు.

బాధ్యతాయుతప్రభుత్వాన్నిగురించి అపోహ కలుగుచున్నది. మ. ఘ. వ ప్రభువుగారి అధికారలను సంకుచితముకావింతురన్న అభిప్రాయ మేర్పడినది. మాఅభిప్రాయమిదికాదు ప్రభువు అధికారాలకేమియు లోపముండదు. బాటెగామకు శ్రీవారికే ప్రధానముగాబాధ్యతవహించియుండును. తర్వాత అది శాసనసభకును బాధ్యతవహించియుండును.

ఈ మహాసభ అందరిమేలుకై ఏర్పడినది ఇందుహిందువులును ముసల్మానులుచేరవలెను మరాట్వాడలోని ముసల్మానులకు మరాటీఅర్థమగును. ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకమహాసభల ఉద్దేశమంతయుఒకటే. జనులఅభివృద్ధియే వీటియుద్దేశము. ఈమూటినుండి ఒకకేంద్రకార్యనిర్వాహకవర్గమునుఏర్పాటుచేసినమూటిలోను ఐక్యతస్థిరపడిపోవును- మనకుబాధ్యతాయుత ప్రభుత్వఅర్హము కాలేదని చీకాకుపడకూడదు-దానికెట్టిప్రతిఘటనలుండినను అదివచ్చియేతీరును- ౨౫ అక్టోబ ౧౯౨౯లో మ-ఘ-వ- నిజాంగారు వైస్రాయిగారికిజాబువ్రాయుచు బీరారుప్రజలకు సంపూర్ణ మండల స్వాతంత్ర్యము (complete autonomy) వాగ్దత్తముచేసియుండిరి ఖాయీనేముగా సెలవిచ్చిరి-

"బీరారుప్రజలకు వారిమండలమునకు సంబంధించినవిషయాలలో సంపూర్ణాధికారమున్న రాజ్యాంగములో సంపూర్ణస్వాతంత్ర్యము మ్మాష్ ఇయ్యబడును- బ్రిటిషుప్రభుత్వతో సంబంధించిన వ్యవహారాలు, సైనికవ్యవహారా మాత్రమే భిన్నమైయుండును-బీరారునూబాకుశాసనబద్ధుడైన గవర్నరునియమింపబడును-"

బీరారుకే ఇంతగొప్పగా వాగ్దానముచేసినప్పుడు ౨౦౦ ఏండ్లనుండియు మనము నిజాముప్రభువుబడిలో రాజభక్తియుక్తులమైయున్నాముకదా మనకుమాత్రముఅట్టివారలను ప్రసాదించారా? జనులందరికిని ప్రాథమికస్వత్వాలుండవలెను- అనునదిమనప్రకృత ముఖ్యోద్దేశమైయున్నది- మనరాష్ట్రములో వ్యవసాయముపై ౮౦ లక్షలకుమించినజనులు ఆధారపడియున్నారు- అందు ౧౫ లక్షలుపట్టాదారులు, ౫౦ లక్షల ౨౦ వేలమంది కౌలుదార్లు, ౧౪ లక్షల ౨౫ వేలమంది వ్యవసాయకులుఅయియున్నారు- పట్టాదారులలో సగము మంది అప్పులపాలై నారనియు వారు రొక్కరిపన్నుకంటే ఎక్కువగావడ్డీలిచ్చుచున్నారనియు ప్రభుత్వవిచారణలో తేలినది- ప్రభుత్వమువారు మార్కెటుశాసనము వడ్డీశాసనము భూపరాధీనశాసన ఇట్టివిచేసిసాయపడినారు,కాని రైతులకనుకొన్నంత లేదు ఇప్పుడు సాహుకార్లు అప్పు ఇచ్చేదిమానుకున్నారు- చాలామందిరైతులకు విత్తనానికేడబ్బుపుట్టదు- ఎద్దులుకొనలేరు- దీనిని గమనించియే ప్రభుత్వమువారు సర్కారీబేంకును స్థాపించుచున్నారు- దానిలోకొన్ని సౌకర్యాలు కలిగించుటఅవసరము- ప్రభుత్వమువారు రైతులకు విరివిగాతక్కావీఅప్పులియ్యవలెను

మనరాష్ట్రములో బందోబస్తుపద్ధతి ౧౨౭౬ ఫసలీలో ప్రారంభమయ్యెను- మొట్టమొదట ఔరంగాబాదులోని పట్టణ్ తాలూకాలో అదిప్రారంభమయ్యెను- అప్పట్లో అచ్చట ఎకరా కి ౧-౦-౬ రూ- పన్నువిధించిరి- గంగాపూరులో ౧-౨-౧౧న్నూ అంబడులో ౦-౧౩-౩న్నూ ఏర్పాటయ్యెను- తర్వాతదానిలో హెచ్చింపుఅయ్యెను- నూటికి ౩౩ పాళ్లవరకు హెచ్చించిరి- మరికొన్ని తాలూకాలలో నూటికి ౪౬ నుండి ౯౯ వరకు హెచ్చింపుచేయబడెను-

ప్రభుత్వాధికారులు ప్రజలను ప్రేమించవలెను. చిల్లరఅధికారులు తాముప్రజాసేవకులమనితలచక తమఅధికారమును బాగాచలాయించుటకై చూచుచుందురు- అధికారులుగ్రామాలకువెళ్ళిన రైతులువారినిమాచి భయపడుదురు- ఈభయాన్ని తొలగించుట అధికారులవిధియైయున్నది- గ్రామాలకుసౌకర్యాలు చాలాతక్కువ నగరాలకే అన్నిసౌకర్యాలున్నవి- రైతులేఅధికముగా ప్రభుత్వానికిచ్చుకొంటారు- కావునవారికే సహకారముచాలాముఖ్యముగా చేయవలసియుండును జాగీరురైతులగతిమరిఅధోగతిగానున్నది.అక్రమపన్నులచ్చట ఎక్కువగానున్నవి విద్యచెప్పించరు పన్నులన్నియు జాగీర్దారుల సొంతాస్తిగా పరిగణింపబడును.

రైతులుచాలమందిరోహిలాలవశమైపోయినారు రోహిలాలు తమఅప్పులను వసూలుచేసుకొనుటలోమహాఘోరకార్యాలను కావించుచున్నారు.అప్పులవారినివారుమర్దించునిర్బంధములో ఉంచుదురు. కొన్నివేళల స్థానికాధికారులును కట్టుకొందురు. ప్రతితాలూకాలో కోలా గ్రామంలో గణపతిరావుఅనువాడు ఒకరోహిలావద్ద ౧౬ రూ॥ అప్పుతీసుకొనెను. మరుసంవత్సరానికి వానినుండి బలవంతముగా ౭౦౦ రూ॥ అప్పుపత్రం వ్రాయించుకొనిరి వాడు ౧౨౫ రూపాయీలు యిచ్చుకొనెను, ఇంకను వడ్డీపెరుగుతునేఉన్నది. జాల్నాలో బలిరాంఅనువాడు ౭౦ రూ॥ రోహిలాఅప్పుతీసుకొని ౧౦౦ రూపాయీలిచ్చినాడు. కాని అప్పు ౪౦౦ వరకు మరలపెరిగెను రోహిలాలు ౧ రూ॥పైసలకు ౨ అణాలవడ్డీతీసుకొందురు. వారు కోర్టుకెన్నడుపోరు. వారిచేయిలో లాఠీఉండగా వారికికోర్టెందుకు? ౧౨౯౦ ఫసలీలో రోహిలాలనియమావలియుండెను. కాని హైదరాబాదును రక్షణశాసనముచేసిననాడు ఈనియమావలిని ప్రభుత్వమువారు ఎత్తివేసిరి. ఇకరోహిలాలు, కాబూలీలు, పఠానులు తండోపతండాలుగాప్రవేశించి వడ్డీవ్యాపారము సాగించి రైతులనుకష్టపెట్టుచున్నారు.

ఇప్పుడు రాష్ట్రములో విద్యవచ్చినవారు ౧౦౦ కి ౫ మందిమాత్రమే. రైతులే ఎక్కువపైకంప్రభుత్వానికిత్తురుకాని ప్రతిగ్రామంలో ప్రాథమిక పాఠశాలలైనను ఉండవలెను వయోజనవిద్య విరివిగావ్యాపించవలెను.

హరిజనులకుండు ఇబ్బందులనుతొలగించవలెను. వారిని బావులలోనికి రానీయవలెను ఒకహరిజనుడు మతాంతరుడైన హిందువులు వానినితాకుదురు. హరిజనులనుద్ధరింపుడు-

హిందూముస్లిం ఐక్యత చాలాఅవసరము కాని కొంతకాలమునుండి హైదరాబాదు అల్లరులు బీదరుఅగ్నికొండ, నాందేడుఘోరాలు. ఇట్టివెన్నియోజరిగెను. పూర్వము పరస్పరం స్నేహంతో ఉండిన హిందూముస్లిములలో ఈకలహాలెందుకు చెలరేగెను- విచారింపజేయవలెను- ఇటీవల ముసల్మానులు తామందరును రాజులేఅనుసిద్ధాంతమునులేవదీసినారు-దీనివల్ల కలిగే అనర్థాలువారు బాగాగ్రహించలేదు- మ-ఘ-వ-నిజాంప్రభువుగారు ౧౫ లక్షలముసల్మానుల ప్రభువులుకారు వారు ఒకటిన్నరకోటిప్రజలకు ప్రభువులు-

## అఖిలభారత హిందూమహాసభ

౨౩ వ సమావేశము.

భాగల్పూరు, మే ౨౯

ఈసారి అఖిలభారత హిందూమహాసభయొక్క ౨౩ వ సమావేశము బీహారు రాష్ట్రమందు భాగల్పూరులో రాబోవు క్రిస్మస్ పండుగలలో జరుగగలదు. ఇందుకు ఆహ్వానసంఘము అప్పుడే ఏర్పడి పనిప్రారంభించినది.బీహారురాష్ట్రియుడైనవాడు ఎక్కడనున్నను రూ౧౫ లు కట్టి ఈ సంఘసభ్యుడు కావచ్చును. ఈ పైకమును భాగల్పూరులో అఖిలభారత హిందూమహాసభ కార్యదర్శి పేర మనియార్డరుగా గాని, చెక్కుగాగాని పంపవచ్చును. తగినంతమంది సభ్యులు చేరిన తర్వాత ఆహ్వానసంఘ సమావేశమొకటి భాగల్పూరులోగాని, బీహారులో వీరి కేంద్రస్థలములోగాని జరుగగలదు. ఈసమావేశంలో కార్యక్రమ విషయములను గూర్చి ఆలోచన జరుగును. ఈ సారి మహాసభను జరుపు విషయంలో ఎవరు ఎట్టి సూచిన జేసినను ఆహ్వానసంఘము వారు కృతజ్ఞతతోస్వీకరించగలరు.

భాగల్పూరు గంగానది గట్టుననున్నది. ఈ ఐ. వారియు బి. యన్ డబ్ల్యు రైలుబాటలతో సంబంధము గలిగియున్నది. ఈభాగల్పూరు జిల్లాకు ఉత్తరమున నేపాలు సరిహద్దుఉన్నది.ఇక్కడ దక్షిణములోపలె నేమందరపర్వతమున్నది.

మహాసభతోపాటు హిందువులు తయారుచేసిన వస్తువులను ప్రదర్శించుటకు ఒక ప్రదర్శన మేర్పాటుచేయబడును, ఈ ప్రదర్శనానికి వస్తువులను పంపదలచువారు భాగల్పూరులో అఖిలభారతహిందూమహాసభ కార్యదర్శిగారికి వ్రాసికొనవలెను.

## మధ్యధరా సముద్రంలో బ్రిటిషునౌకలవిజయములు

మధ్యధరాసముద్రంలో బ్రిటిషు జలాంతర్గాములు నాలుగుపెద్ద శత్రునౌకలపై టార్పిడోలనువేసినట్లు మే ౨౮ వ తేదీనాడు ఒక ప్రకటన చేయబడినది. ఆనౌకలు లిబియాలో శత్రువులకు సహాయసేనలను యుద్ధసామగ్రికి గొనిపోవుచుండెనట:

యుద్ధప్రారంభంనుంచి ఈ మే౧౬ వతేదివరకు బ్రిటిషునౌకలు౩౮౫ జర్మనునౌకలను, ౨౧౫ ఇటాలీయ నౌకలను కొన్నిటిని ముంచినవి. కొన్నిటినిపట్టుకొనినవి. మరికొన్ని ఆత్మవిఘాతము గావించుకొనినవి.

ఈమధ్య బిస్మార్కుఓడను బ్రిటిషువారు ముంచివేసినందువల్ల ఆ ఓడలోనున్న ౨౦౦౦ మంది జర్మను నావికులు మునిగిపోయినట్లు తెలిసినది.

అట్లాంటిక్ సముద్రంలో జర్మనునౌకలను యుద్ధము చేయునట్లు చేయుటకై బ్రిటిషు నౌకలు యత్నించుచున్నవి. మే ౨౪ వతేదిని సాయంకాలము ఉత్తర అట్లాంటికులో బ్రిటిషునౌకలకు జెందినవిమానాలు కొన్ని జర్మనునౌకలవెంటబడి ఒకదానినైనను ముంచియుండవచ్చునని బ్రిటిషువారి ప్రకటనలో నున్నది. ఉత్తరముసద్రంలో రెండు జర్మనునౌకలు కనుపించగా ఒకనౌక బ్రిటిషువిమానాలచే ముంచివేయబడెను మరొకటికుంటుకొనుచు రేవుకుపోయినది.

## అమెరికా రాయబారిని బ్రిటనునుండి పిలిపించుట.

బ్రిటనులో అమెరికా రాయబారిగ క్రొత్తగా నియుక్తుడైన వైనాన్టుగారిని అమెరికాకు రమ్మన్నారు. ఎందుకోతెలియుటలేదు.

## రష్యాతో బ్రిటనుసంబంధం

మే. ౨౮ వ తేదిన బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో విదేశాంగ మంత్రి. ఈడనుగారిని మధ్యధరా సముద్రము నానుకొనియున్న ప్రదేశాల విషయంలో రష్యావారి ఉద్దేశ్యాలను గురించి ఏమైనా అభయవచనాలు లభించినవాయని ప్రశ్నించగా, ఆవిషయంలో ఇప్పుడేమీ ప్రకటించవీలులేదని చెప్పినారు.

## కెయిజరు అస్వస్థత

ఇపుడు అమెరికాలో తలదాచుకొని యున్న పూర్వపుజర్మను కెయిజరు 'చాలా జబ్బుతో బాధపడుచున్నాడు. ఇతనివయస్సు ౮౨ఏండ్లు. ఇతనికి నయముగునను ఆశ సందేహమని వైద్యులనుచున్నారు.

## గార్ల

ఎండ దెబ్బ

(ఒక విలేఖరి) ౨౫-౫-౪౧

మొన్న శుక్రవారం బెజవాడనుండి హైదరాబాదుపోవుబండిలో షుమారు౧గంటకుదిగి ఇద్దరు గొల్లకులమువాళ్లు అచటికి ౩ మైళ్లదూరముగల గార్ల జాగీరులోని గొల్లగూడెమునకువచ్చుచుండిరి. అయితే వారిలో ఒకడానికి దాహముమిక్కుటమై మార్గమధ్యమున మరణించెను. విచిత్రమేమన పండువాడు చేయబోయినపుడు యీ ఆతనిశవము పట్టుకొన్నచో తెలిసివచ్చుచున్నది. దానికికారణముకొందరుఎండ పిడుగుపడుటయనుచున్నారు. మొత్తముమీద ఈ ప్రాంత్యములలో ఎండలుకడు తీవ్రముగనున్నవి-మటియుకొన్నిజాలనుండి సహింపరానివి గానున్నవి

## శ్రీపాల్వంచ సంస్థాన ప్రాథమిక విద్యా శాఖావిధానము

ఈసంస్థానమున ౨౭పాఠశాలలుకలవు. దీనిలోకొన్ని ఇందాదిస్కూల్సు, సాధారణముగా స్కూలుకొక మాస్టరు కొన్నింటిలో విద్యార్థులసంఖ్యననుసరించి ఇద్దరేసిమాస్టర్లుకలరు. ఈపాఠశాలలపరీక్షించుటకు ఒకసూపర్ వైజరుకలడు సూపర్ వైజరునకు ౪౫రూపాయిలున్నూ, సర్కారుస్కూలు టీచరునకు ౧౫రూపాయిలున్నూ, ఇందాదిస్కూలుటీచరునకు ౧౦ రూపాయిలున్నూ జీతములని తెలియుచున్నది. ఇదిగాక సాదరనిమరియొకరూపాయి ఒక్కొక్కస్కూలునకదనముగా ఇవ్వబడుచున్నట్లుగూడా తెలియుచున్నది. ఇదియేట్లుండినను సంస్థానము నుండి సాలీనాయిచ్చుమిగుచున్నట్లు అయిదువేలరూపాయిలువిద్యావిషయంలో వ్యయమగుచున్నట్లు తెలియుచున్నది.

ఈపాఠశాలలకు చక్కనైన భవనములులేవు గానికొంతకాలక్షేపమున కొంటకమూగాని ఇండ్లుమాత్రమేర్పాటు చేయబడియున్నవి. ఈటీచర్లకు ప్రమోషనులులేవు, టి. ఏ. లుగూడలేవు, కొన్నిటాన్సుఫర్లులేకపోలేదు, ఈమధ్యజరిగిన ట్రాన్సుఫర్లు చూచుకుంటే బీదమదిరిస్సులకష్టం విచారణీయమైనదే, కొందరుమాస్టర్లు తమకుబదిలీఅయిన గ్రామానికిపోవుటకై తమకుటుంబమునకు ప్రయాణపుఖర్చుఒకనెలజీతంకంటే హెచ్చుగా ఉంటుందనటలోఅతిశయోక్తి ఉండనేరదను కుంటాము అయితేవీరెట్లాఆనెలాజీవించిదమో కనుకఖర్చులు సర్కారుఇచ్చిపంపినచో వారికికొంతఅవసరా ఆవ్యతుండదవచ్చు.

ఈటీచర్లు ట్రెయినింగు, నాలుగుతరగతులు చదివినవారైయుండవచ్చును. కానిసర్కారు బోధనార్హ్యపన పాఠశాలలో ట్రెయినింగుపొందినవారు మాత్రముకారు.

ఒకానొకప్పుడైనను యీటీచర్లకు ఒకసెంటర్ క్లాసుఏర్పాటుచేసి వారొనర్పుబోధనా పద్ధతులనుపరీక్షించి ప్రస్తుతందేశమందు జనియించుచున్న ఆధునికపద్ధతులను గూర్చివివిధ్యముతో ఉపాధ్యాయులకు తెలుపుచు వారధికవిజ్ఞాన మూర్జించుటకుతగునవకాశములు సూచించు సమావేశములు సూపర్ వైజరు ఏర్పాటుచేయుట అవసరము.

సుమారు ౫సంవత్సరములనుండి ఈసంస్థానమును కోర్టుఆఫ్ వార్డ్సువారు తమఅధికారముక్రింద పరిపాలించుచున్నారు. వీరిసంస్థానప్రజలకు శాశ్వతమైనసౌకర్యములనేకములు కల్పించుచున్నారు. అన్నిశిరస్తాలయందును ఆధునికపద్ధతులను అమలుపరచుటకై యత్నించుచున్నారు. విద్యాశాఖనుగూడక్రమముగాఅభివృద్ధిలోనికి తీసుకురాగలరనియే ఆశించుచున్నాము.

ఇందుకుముందుగా ఖాల్సావిద్యాశాఖతో సంస్థానవిద్యాశాఖకు సంబంధము ఏర్పాటు చేయవలెయును. ఉపాధ్యాయులు ట్రెయినింగుపరీక్షకై పోవుటకనుజ్ఞనొసగి ప్రోత్సహించ వలెయును.

వత్సరమునకైదుగురుపాధ్యాయులు ట్రెయినింగుపొందినచో అయిదుసంవత్సరములలో అందరుమరిరిస్సులుగూడ అరితేరినవారగుటకు సందేహములేదు, మూడుమాసములకైనను ఒకపర్యాయము టీచర్లకుఒకసెంటర్ క్లాసు ఏర్పాటుచేయవలెయును ఖాల్సాస్కూళ్లలో ప్రతిమాసంలోజరుపబడెసెంటర్ క్లాసునకు సమీపములోగలసంస్థానస్కూలుటీచర్లుగూడ హాజరైగౌరవ భావంలో వారిబోధనావ్యాఖ్యాసన పద్ధతులయొక్కచర్చలయందుపాల్గొనచుండవలయును. ఇందుకనుకూలముగాబూర్గంపాడులో ఖాల్సాఎలిమెంటర్ స్కూలుకలదు. ఇక్కడిమదిరిస్సులు ప్రతిమాసంలో నూఒకరోజున సెంటర్ క్లాసుఏర్పాటు చేసుకొని చర్చించుచుందురు. వీరితోసుమారు ౧౦లేక ౧౫ మైళ్లదూరములోగలసంస్థాన స్కూలుటీచర్లు వచ్చిపాల్గొనవచ్చును. కనుకయిట్టిఏర్పాట్లు సర్కారువారుచేయించితే కొంతవరకనుకూలముగానుండునని తోచుచున్నది.

## కొత్త్బెరినూనె సుంకము

కొబ్బెరినూనె ధరిపడిపోయినందున హైదరాబాదుప్రభుత్వమువారు ౧౨౦సేర్లపల్లాకు ఇదివరలో ౩రూ॥లు సుంకముతీసుకొనుచుండినది ఇకముందు౨రూ॥ ప్రకారము తీసుకొందురు.

## హైదరాబాదుకంపెనీ శాసననివేదిక

౧౩౪౯ ఫసలీ శాసనముయొక్క అమలుచేసిన ప్రభుత్వనివేదికనుకృతజ్ఞతతో అందుకొనినాము.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర జ్యేష్ఠ శు॥౧౦

గురువారము


## మహారాష్ట్ర మహాసభ

మహారాడవ హైదరాబాదు మహారాష్ట్రమహాసభ నాందేడు జిల్లాలోని ఉమ్రీలో శ్రీ కాశీనాథరావు వైద్యగారి అధ్యక్షతలో గతవారముజరిగెను. ఇంతవరకు మాకు ప్రయత్నముచేసినను మహాసభాచర్యలు, ఆహ్వానసంఘాధ్యక్షుని అభిభాషణము, తీర్మానాలు లభింపకపోయెను. అవి మరాటీలోనున్న వనియు, తిన్నగా పంపుదుమనియు ప్రత్యుత్తరమువచ్చినది. మన రాష్ట్రములో కొన్ని మహాసభలు పత్రికల సహాకారము పొందుటలో అశ్రద్ధచేయుట ఇటీవల వ్యక్తమగుచున్నది. అట్లుండిన ఉద్యమవ్యాప్తికాటంకము కలుగునని ప్రజాహిత సంస్థలనడుపువారు గ్రహించకుండిన సంస్థల కార్యవర్గమువారు సమర్థులును శ్రద్ధకలవారును, దూరదృష్టికలవారునునైన అధికారవర్గమును ఎన్నుకొనుట ముఖ్యమైన పద్ధతి.

ఇప్పుడు మాకులభ్యమైన అధ్యక్షుని యుపన్యాసమునుగురించి మాత్రమే చర్చింతుము. కాశీనాథరావువైద్యగారు సుప్రసిద్ధులు. సంస్థాన కాంగ్రెసు సత్యాగ్రహములో పాల్గొన్నవారు. దేశసేవకై తమ గొప్పఆదాయముక్తమగు వకాలతును నష్టపరచు కొన్నట్టివారు. హైదరాబాదు రాజ్యాంగశాసనమునకు ఆధారభూతమైన ప్రభుత్వనియమిత విచారణసమితిలో సభ్యులుగానుండినట్టివారు. అట్టివారిభావములకు విలువయుండును.

వైద్యగారి కొన్ని భావములు స్పష్టముగాను కొన్ని అస్పష్టముగాను ఉన్నవి. వారు కొన్ని ముఖ్యసమస్యలను కొంతవరకు బాగానేచర్చించినారు. మరికొన్నిటిని నెందులకో స్పృశించనేలేదు. వారిభావాలలో కొన్నింటితో ఏకీభవింతుము. కొన్నింటితో భిన్నింతుము.

వైద్యగారు రాజ్యాంగశాసనములకు మూలమైన వని తిలోని సభ్యులైయుండినందున వారు రాజ్యాంగశాసనముపై ఇచ్చినఅభిప్రాయమునకు చాలా విలువయుండును. వారు రాజ్యాంగశాసనముపై స్పష్టమైనట్టియు, తీవ్రమైనట్టి, ఖండనపూర్వక మైనట్టియు నభిప్రాయమును ప్రసాదించినారు. అయితే రాజ్యాంగశాసనమైన కాలములోనే ఈవిధముగా వారభిప్రాయమిచ్చియుండిన దానికి విలువకలుగుచుండెను. ఇంత ఆలస్యముగా విమర్శించుటవలన లిమిటేషను పోయిన పత్రాలవలె విలువలేనిదిగా పరిణమింప వచ్చును. నాయకులైనవారు సకాలములో సరియైనపని చేయవలెను. అస్పష్టాభిప్రాయాలు నాయకుల అనుయాయులను గందరగోళములో పడవేయును. హైదరాబాదు రాజ్యాంగశాసనముగురించి వైద్యగారు అభిప్రాయమిచ్చినారు "రాజ్యాంగసంస్కరణములు అసమగ్రమును అసంతృప్తికరమును నష్టదాయకమునునై యున్నవి. (The Reforms are not only inadequate and unsatisfactory but reactionary to certain extent) ఈభావమునే వివరించుచు విపులముగా చర్చించినది వేరుచో ముద్రించినాము.

బాధ్యతాయుత ప్రభుత్వమును గురించి ఇత్తెహాదు వారు మూడేండ్ల నుండి వ్యతిరేకప్రచారముచేయుచుండిరి. తమ ప్రచారఫలితముగా ప్రభుత్వము వారు దానినిఖండితముగా నిరాకరించిరని ఇత్తెహాదువారిటీవల ప్రకటించుకొనినారు. ఏదియెట్లున్నను హైదరాబాదుప్రభుత్వమువారు బాధ్యతాయుత ప్రభుత్వమునకు తామేమాత్రమును సుముఖులము కామని స్పష్టముగా విపులముగా ఒకఅధికారప్రకటన ఇటీవలనేకావించిరి. ఆసందర్భములో వైద్యాగారి అభిప్రాయము ముఖ్యమైనదిగా నుండును. ఎందుకనగా నేషనల్ కాన్ఫరెన్సు అను ద్వితీయనామమువహించియుండిన సంస్థాన కాంగ్రెసు పక్షాన వైద్యాగారు బాధ్యతాయుతప్రభుత్వావశ్యకతను గురించి ఘాటుగాజవాబిచ్చియుండిరి. మరి ఇప్పుడేమంటున్నారనగా ప్రభుత్వమంత్రి వర్గము (ఎక్జిక్యుటివ్ లేక బాబెహుకూమతు) ప్రధానముగా మ. ఘ. వ. నిజాం ప్రభువులుంగారికే బాధ్యతవహించునని చెప్పినారు. ఇటీవలనే ఎం. నర్సింగ రావుగారును మరియిద్దరుహిందూనాయకులును ఇదే అభిప్రాయ మిచ్చియుండిరి. కాని రెండవపక్షములో ఈమంత్రి వర్గమెవ్వరికి బాధ్యతవహించును అను మాటపై స్పష్టముగా చెప్పనొల్లక చల్లగా గంతువేసియుండిరి.అయితే వైద్యాగారు వారికంటే ఒకఅడుగు తిన్నగా వేసి "రెండవపక్షములో మంత్రివర్గము శాసనసభయొక్క సహాయమునుకూడ పొందియుండును. అట్టి సభయొక్క విశ్వాసము ఆవర్గానికి కలిగితే ప్రజా సహాకారముకూడా లభించును." అని ద్రావిడ ప్రాణాయామరీత్యా తామేదో చెప్పదలచుకొని మరేమో చెప్పినట్లుగా చెప్పినారు.

మ. ఘ. వ. నిజాంప్రభువులుంగారు ౧౯౩౬లో బిరారురాజ్యము తమకు వాపసువచ్చినట్లైతే బిరారుప్రజలకు సంపూర్ణమండల స్వాతంత్ర్యము (complete autonomy) నిత్తుమనియు బ్రిటిషు ఇండియాలో ఏయే రాజ్యాంగపద్ధతులున్నవో అవన్నియు మీకిత్తుమనియు బిరారు ప్రజలకు సందేశమిచ్చియుండిరని ఆనాటిమాటను జ్ఞాపకముచేయుచు ౨౦౦ ఏండ్లనుండి అవిచ్ఛిన్నభక్తితో పాలితులగుచువచ్చిన ఈరాష్ట్రప్రజలకు అంతమాత్రపు అధికారాలైనా ఇయ్యరా అనిప్రశ్నించినారు.

ప్రభుత్వోద్యోగులలో చాలామంది తాము ప్రజాసేవకులమని భావించుకొనరనియు, గ్రామాలలోని ప్రజలు సాధారణముగా వారినిచూచిన భయపడుదురనియు వైద్యాగారుసెలవిచ్చినారు. దీనిని మన ప్రభుత్వమువారును గమనించకపోలేదు. న్యాయశాఖలో లంచాలను నిర్మూలించుటకై వారు విచారణలుకావించుచున్నారు. ఇటీవలనే మనపూజ్య ప్రధానామాత్యులుంగారు ఉద్యోగులు ప్రజల సహాకారమును బాగుగా పొందవలెననియు వారిని ఆదరించి ప్రేమించవలెననియు అధికారులకు బోధించియుండిరి.

గ్రామాలలో సౌకర్యాలుచాలా తక్కువయను వైద్యాగారి యభిప్రాయముతో మేము సంపూర్ణముగా ఏకీభవించుచున్నాము. ప్రతిగ్రామానికి పక్కాగోడ్లుకాకున్న కచ్చా రోడ్లుండవలెను. ప్రతిగ్రామానికి ప్రతిదినము టప్పాయెందుకు పోరాదు? మనము అక్బరు హుమాయూనుకాలములోలేము. "బ్లిట్జు" కాలములో ఉన్నాము. గంటగంటకు ప్రపంచపరిస్థితులు మారుచూఉంటే ౧౦ దినాలకో ౨౦ దినాలకో గ్రామాలకు టప్పాపోయిన నేమెట్లు? టప్పాను లాభముకొరకే నడుపదలచుకొన గూడదు. ప్రతిగ్రామానికి సౌకర్యము కలిగించకున్న టప్పాయింకను అనాగరిక స్థితిలో ఉన్నదనవలెను. టప్పా జనానులను ఇప్పుడుండువారికన్న మూడంతలు హెచ్చుగా పెట్టిననే కాని పల్లెటూళ్ళకు దినదినము టప్పానడువజాలదు. ప్రతిగ్రామములో ఒకసర్కారీబడి, ఒక సర్కారీ యునానీ లేక అయుర్వేదాలయము ఒకఖేలనాస్థలము (recreation playing ground) ఉండవలెను.

వైద్యాగారు రోహిలాలుచేయు అక్రమాలనుగురించి విపులముగా చర్చించినారు. వారు కోర్టులకంటే తమలారీలనే ఎక్కువగా నమ్ముకొన్నట్టి వారని తెలిపినారు. వారిదౌర్జన్యాలను గురించి ఉదాహరణపూర్వకముగా చూపించినారు. "హైదరాబాదు రక్షణశాసనము"నకు సంబంధములేని తుదిసూత్రములో "రోహిలాలనిబంధనలు రద్దు" అని ముక్తసరుగా సూత్రించినది మాకు జ్ఞాపకమున్నది. ప్రజా "రక్షణ" కేర్పడిన శాసనములో రోహిలాలనుండి ప్రజల రక్షణ కాలేదు. ఇది విరోధాభాసముగా (Anamolous) గా ఉన్నది.

"హిందూ ముస్లిం ఐక్యతకు సంబంధమైనముచ్చట్లు"మూడేండ్లనుండియు జరుగుచున్నవి. అవి మళ్లీ ఈకొన్ని దినాలనుండి మరల పైకివచ్చినవి. కాని వైద్యాగారీవిషయములో తమ అభిప్రాయాన్ని తెలిపి అటోఇటో ఏదో యొకటి తేల్చియుండిన బాగుండెడిది. దీనిని బట్టిచూడగా మేమిదివరలో తెలుపుకొనినట్లుగా ఈముచ్చట హిందువులపక్షమునుండి మాత్రము వ్యక్తులపక్షాన జరుగరాదు. మహాసభలయొక్క కార్యనిర్వాహకవర్గాలును ముఖ్యముగు సంస్థల నడుపువారును ఒకప్రత్యేక సమావేశములో చేరి బహుజనాభిప్రాయముతో ముగ్గురికో నలుగురికో తమపక్షాన మాట్లాడుటకు అధికారమిచ్చుటయు ఆ యధికారా లెంతమట్టుకో నిర్ణయించుటయు తగినపద్ధతి అని యనుకొందుము.

వైద్యాగారు వ్యవసాయకుల గురించి విపులముగా చర్చించినారు. ఆ చర్చ సమంజసముగానున్నది. రైతులకు తక్కావీసహాయము విరివిగా కావలెను. ప్రభుత్వ బెంకు వెంటనేఏర్పాటుకావలెను. రైతులపన్నులు తగ్గించవలెను అని మేమును ఒప్పుకొందుము. దానితోపాటు ఆదాయమును పన్ను ఏర్పాటు కావలెనని మాత్రము మా పాత అభిప్రాయాన్ని మళ్లీ తెలుపుకొనుటలో వేసరిక చెందము.

---

## ఈరానీల దండయాత్ర

నారాయణపేట, ౨౩ తీర ౧౩౫౦ ఫ. (ఒక విలేఖరి)

తా॥ ౧౭ తీర రోజు బుధవారం యీరానిబిచ్చగాండ్రు సుమారు ౫౦ మంది స్త్రీలు పురుషులు ఇక్కడికివచ్చిరి. వీరు రాకముందే యిక్కడిప్రజలలో ఒకవిధమైన భయము పుట్టించబడియుండెను. ఆగియేమన చుట్టుపక్కలపల్లెటూళ్లలో వీరుపోయి వ్యవహరించును వ బీదప్రజలను మాకు సర్కారు ఆజ్ఞయిచ్చినారు, డబ్బుయివ్వమనెదరు. యివ్వనిపక్షమున మీయిండ్లు కాల్చుమనెటు లేకమిమ్ములనుకొట్టిచంపుదుమనిఅనెదరు ప్రజలునిరక్షరాస్యులై చిన్నచిన్న పల్లెటూర్లలో వందలకొలదిచందాలుచేసి యిచ్చినారు, కరణం, పటేండ్లు కూడయేమివిచారించక దారియేమియు తెలియక భయపడి బీదప్రజలతో చందాలుచేయించి యిచ్చినారు, ఇక్కడచిన్నచిన్న దుకాణములలోవర్తకుల బెదరించి, సామానులు వ డబ్బుయెత్తుకపోయినారట వీరుఇక్కడ మూడురోజులవరకు పోలీసు అమీనుకచ్చేరిముందర డేరాలు వేసియుండిరి, వీరు శుక్రవారంనాడు చందావసూలుచేయుచు బుగ్గప్పశ్రీర్ణ అనేవారుదుకాణంలో చందాయివ్వనందున రా॥ రాజమల్లయ్యపై కొట్టేటందుకు లేచిరి. కానిగొప్పఅల్లరిరూపముదాల్చు యీజగడం కొందరుసభ్యగృహస్థులవల్ల రూపుమాపాయెను. వీరివెంబడి రా॥ అనంతరాంరావుగారు పట్వారి పల్లెపాలీసుపటేలుపంద్రి ఒక, దెసులేని కానిస్టేబిలుకుండెను. చందాపట్టి పటేలుపంద్రిచేతులోనుండెను. ఇటువంటి పెద్దపెద్దగ్రామములలో ఇటులఅత్యాచారముజరుగుచుండ చిన్నచిన్న పల్లెటూర్లగతి దేవునికేతెలియును.

వీండ్లుచందాలు చేసేవిధమేమనగా ఒక పల్లెటూరిలో కరణం లేక పోలీసు పటేలుదగ్గరికి యిద్దరు లేక ముగ్గురుపోవుదురు. పటేలుగారికి యింకొకపల్లె పటేలు గారువసూలుచేసియిచ్చిన చందాపట్టిచూయించి మీపల్లెలో ౧౦౦ లేక ౨౦౦ చందాయివ్వమని భయముచూపుదురు వీరిరాకనుమునుపే అపల్లెటూరివారు భయభీతులైవుందురు– మరల కరణం పటేండ్లముఖంచూచి అడిగినంత డబ్బు కోర్ఫుయిచ్చి శాంతిపరచి చందాపట్టిలో వాండ్లుయిచ్చినకంటె అధికముగాఅచ్చి లేకపోతే వీండ్లతో ముక్తులగుదురు యీవిధముగా వీండ్లుప్రతిపల్లెలో వందలకొలది డబ్బుతీసుక ప్రభుత్వము పలుపుచుసంచరించుచున్నారు

ప్రజలయొక్క హీనస్థితి దౌర్బల్యము ప్రభుత్వముదెరుంగును. యిట్టిసమయములో పరదేశీయులకు, రక్తహీనులైన దరిద్రబీదప్రజల రక్తము పీల్చు ఈరానీలను వెంటనేవిచారించి శిక్షించగలరు.

### ఆర్యసమాజ స్థాపన

నారాయణపేటకు ౪ మైళ్ల దూరముననున్న "జాజాపురం" గ్రామములో శాలుక మఖ్తల్, శ్రీయుత మహేంద్రప్రతాపశాస్త్రి ఉపదేశక్ గారు ఇక్కడ ఆర్యసమాజము స్థాపనముచేసి మృదుమధురముగా హిందిలో ధర్మప్రచారంచేసిరి శ్రీమాన్ సాంబమూర్తి, సిద్ధాంతరత్న గారు తెలుగులో ఉపన్యసించిరి: తదనంతరం దిగువవ్రాయబడినకార్యకర్తలుయెన్నుకోబడిరి శ్రీమాన్ నాగప్పగారు ప్రధాన్, శ్రీమాన్ అంబాజీగారు ఉపప్రధాన్ శ్రీమాన్ శిద్దణ్ణగారు మంత్రి శ్రీమాన్ కనకప్పగారు ఉపమంత్రి శ్రీమాన్ లక్ష్మణ్ణ అమరాది కోశాధ్యక్షుడు

---

## భారతీయులకొరకు భారతీయుల ప్రభుత్వం

బ్రిటిషువారి ఆశయముఇండియా సహాయమంత్రిప్రకటన

లండను, మే౨౯

ఇండియా దేశ ప్రజలకొరకు ఇండియాదేశ ప్రభుత్వం ఇండియాలో ఇండియా దేశీయులవలననే జరుపబడవలెనుగాని లండనులోని బ్రిటిషుప్రభుత్వంవారివల్ల జరుపగూడదు, ఇండియాలో విదిసపార్టీలవారిలో అధికమైన ఐకమత్యమును కలిగించుటకు ప్రభుత్వమువారు ప్రయత్నము చేస్తూనేవుందురు ఇండియాలో రాజకీయపక్షాలు కొన్నివున్నమాట నిజమేగాని ఇండియాలోవున్న ప్రజలలో ౧౦౦కి౯౯మంది యుద్ధంలో బ్రిటిషువారికిసర్వవిధములా సహాయంచేస్తూనేవున్నారు" అని ఇండియాసహాయమంత్రి డేగన్షైర్ ప్రభువు, ప్రభుత్వపక్షమున లీడ్సు విశ్వవిద్యాలయములో చెప్పెను వీరు లీడ్సువిశ్వవిద్యాలయానికి వైసుఛాన్సలరుగా వున్నారు.

---

## ఋణపరిష్కారసంఘాలు చేసినపని

హైదరాబాదు (దక్కన్): జూను ౩ ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు,

౧౩౪౭ ఫసలీలో పైసంఘాలు తృప్తికరముగాపనిచేసినవి. ఈసంఘాలు ౧౩౪౨లో స్థాపితమయ్యెను. అప్పటినుండి వీటిసంఖ్య ౯ నుండి ౨౬ వరకుపెరిగెను. వీటిసమక్షములో ౧౩౪౭లో ౧౧౨౯౦ ఋణంకేసులు విచారణకువచ్చెను. ఇంతమంది ఋణము ౭౧ లక్షల రూపాయీలు మరియీసంవత్సరము ౫౭౮౫ మంది ఋణగ్రస్తులరుజువైరి వీరిబాకీమొత్తము ౫౭ లక్షల ౪౫ వేల ౯౩౫ రూ. ఇందునుండి నియమావళిలోని నవ సూత్రప్రకారము ౧౩౭౧ కజ్జియాలు ౧౧ లక్షల చిల్లరఋణము బాబతువి తోసివేయబడెను. ౧౨౩౫ మంది ౧౧ లక్షల ఋణము బాబతులో సమాధానానికి రానందున పరిష్కారముకాజాలకపోయెను– ౩౩౪ కేసులలో ౩ లక్షల ౫౯ వేల చిల్లరపైకము బాబతులో అప్పిచ్చినవారు తమలెక్కల దాఖల్ చేయనందున వారికిప్పించుటకువీలులేదని పరిష్కరింపబడెను. ౧౧౮౩ కేసులలో ౧౧ లక్షల చిల్లరఅప్పును ౭ లక్షల ౯ వేలచిల్లరపై పరిష్కారముచేయబడెను అనగా రూటికి ౩౭ పాళ్ళు ఋణములో తగ్గింపుచేయబడెను. అట్టి పరిష్కృతమైన మొత్తములో ౧౫ వేలచిల్లర నగదుఇప్పింపబడెను. మిగతపైకానికి కిస్తుకేర్పాటుచేయబడెను. ౧లక్ష ౯౨ వేలచిల్లరపైకంబాబతులో ౫౭౧౭ ఎకరాలభూమిపరిష్కారముగా కౌలుకు ఇప్పింపబడెను. ౧౮౯ ఎకరాలు ౧౧౫౦౭ రూ. కు అమ్మించిపరిష్కారముచేయబడెను ౩౫ మంది అప్పిచ్చినవారు స్వయముగాకలపోయిరి. అందుచేత వారిఅప్పుబాబతులో బాకీదార్లకు సర్టిఫికెట్లుఇయ్యబడెను. నివేదికకాలములో పది సంఘాలు పనిలేనందున ఎత్తివేయబడెను.

ఈసంఘాలమూలమునను ఇంతలోస్థాపింపబడనున్న బ్యాంకులవల్లనున్ను బీదరైతుల అపారమైన అప్పుభారము పరిష్కారముకాగలదని విశ్వసింపబడుచున్నది.

---

### కిషన్ గంజ్ ఆర్యసమాజము

హైదరాబాదు(దక్కన్) జూన్:3 ఆర్యసమాజము కృష్ణగంజ్ యొక్క ౧౩–వ దమాడవ వార్షికోత్సవము తేది౫–జూన్ ౧౯౪౧(౧౦తీర ౧౩౫౦ అమర్దాదు ౧౩౫౦) గురువారము, శుక్రవారములందు కృష్ణగంజిలోజరుగును. ఈసందర్భమున శ్రీ॥పం॥ విహారీలాల్ గారు శాస్త్రీర్థ శ్రీపం॥ సూర్యదేవుగారు సాహిత్యాచార్యులు శ్రీపం॥ బుద్ధదేవువిద్యాలంకారుగారు శ్రీపం॥ జయదేవువిద్యాలంకారుగారుఇత్యాదుల యొక్క వ్యాఖ్యానములు మరియు శ్రీపం॥ మున్నాలాల్ మిశ్రగారిభజనకూడను. గాన సకాలమునపదయచేయగలరని ప్రార్థన.

రాందేవు
మంత్రి

---

### రష్యాలో యుద్ధకౌశల పరీక్షలు

రష్యాలో సేనలయొక్కయు, నావికులయొక్కయు, వైమానికులయొక్కయు కౌశలమును పరీక్షించుటకు అనేకరాష్ట్రములయందు యుద్ధక్రియల నటనలుజరుగుచున్నవి. ఇట్టివి ప్రధాననగరమగు మాస్కోలోను, యుక్రెయిను రాష్ట్రములో అక్కడక్కడనుజరిగినవి. శత్రువులుఆకాశమార్గమున పారషూటులనుండియు, విమానములనుండియు దిగివచ్చుచో ఏమిచేయవలయునో అంతయు పరీక్షించబడినది

---

### మూడు నార్వేయనౌకలను జర్మనులు పట్టుకొనుట

నార్వేయుల మూడునౌకలనుజర్మనులుఅంటార్కిటికుసముద్రంలో వశపరచుకొనిఅందలినార్వేయనావికులను మొదటజర్మనీలో ఖైదీల శిబిరాలకును, కొన్నాళ్లతర్వాత అక్కడినుండి నార్వేకు నుపంపించినారట తుదకు నార్వేలో విడుదలగావించినారట–

---

### ఇటాలీయనౌకను జర్మనువారు ముంచివేయుట

ఒకఇటాలీయుల ప్రయాణీకుల నౌకను మూడాగు లాప్పెడో దెబ్బచే వైరాష్ట్ర గంటలోముంచివేసినట్లు మొకెంచవలెనివార్త

# ౪౦౦౦ యేండ్లక్రిందటి నియంత

## ఆర్థికసభాకార్యదర్శి రేడియోప్రసంగము

మౌల్వీమహమ్మదు అబ్దుల్ రజాకు హైదాను సహాయ కార్యదర్శిగారు రేడియోలో ఈక్రింది ప్రసంగము చేసినారు:

"౧౯౧౪ నాటియుద్ధముతరువాత ప్రపంచమున క్రొత్తక్రొత్త ప్రభుత్వపద్ధతులు బయలుదేరినవి. అదినియంతలప్రభుత్వము. దానిని అహంభావప్రభుత్వమనిచెప్పవచ్చును. ఇట్టిప్రభుత్వములు యూరోపు నందంతటను వ్యాపించిపోయినవి. వీరుతమవర్గములోనే యావదధికారమును కేంద్రీకరించుచుందురు. ఇతరవర్గాలయభిప్రాయములను లెక్కచేయరు. ఇటలీజర్మనీదేశాలలోనిట్టి వేర్పడినవి. వీటికి బలప్రయోగమే మూలాధారము. అచ్చటిపరమేశ్వరుని పూజలుగూడ ప్రజలు స్వతంత్రముగ చేయజాలరు. అచ్చటదేవుడు మతము మతకర్తలున్ను త్రోసివేయబడినారు. ఇట్టిజర్మనులు యూరోపులోని యితరదేశాలయొక్క స్వాతంత్ర్యమును లాగుకొన్నారు, ప్రపంచములోని యితరజాతులన్నింటిపైనను తమప్రభావమును వేయజాలుచున్నారు. జర్మనీజాతియుండా వందనమే దేవపూజగా పరిగణింపబడుచున్నది, ఫాసిస్టుఅనియు, నాజీయనియు రెండుపేరులు వేరుగనున్నను యీరెండును ఒకేపద్ధతిపై నడుచుచున్నవి. వీటినినడిపించు కొందరుముఖ్యులు నాస్తికులు. మానవనిర్మాణమునకు దైవనిర్మాణముపై ప్రాముఖ్యతయిచ్చుచున్నారు వీరిపద్ధతులచేత యుద్ధములు నన్నగువలిప్రబలి ప్రపంచమును నాశనముచేయుచున్నవి—

౪౦౦౦ వేల యేండ్లక్రిందట జలప్రళయము నాటి చరిత్రను మనము గమనింపవలెను అజల ప్రళయానంతరము ఈబాదురస్యాజర్మనీ, యిటలీలుఉండునట్టి ప్రభుత్వమొకటేర్పడెను. దానియొక్క నియంతనమ్రూదుఅనువాడు. అతడునే నే దేవుడననిచెప్పుకొనెను— దైవసంకల్పమునకు విరుద్ధముగా నొకజాతి యింకొకజాతిని నిర్మూలముచేయజాలదు. ఇప్పటినియంతలపరిపాలనము దేవునిపరిపాలనమును త్రోసిరాజా చేయుచున్నది వీరివెనుక సైతానుశక్తిపనిచేయుచున్నది. ఇదేవిధముగ పూర్వము ఆదిమపురుషుడయిన ఆదమును సైతాను మోసపుచ్చియుండెను. అదేవిధముగ నమ్రూదుచే అహంబ్రహ్మ, అనిపించినారు— నమ్రూదు జలప్రళయములో ప్రపంచమును రక్షించిన నూహ్‌యొక్క సంతతివాడు— అతడుక్రమముగ ప్రచండుడయ్యెను— అతనిరాజ్యము మొదట బాబల్‌లో ప్రారంభమయ్యెను— అతడుచాలా క్రూరుడై రాజ్యమును విస్తరింపజేసికొనెను. తానేదేవుడనియు తొట్టుతలచిన నట్లుచేయగలవాడననియుతలచి యనేకహత్యలుచేసెను— జనులు అతనిశక్తికి భీతిల్లి అతనికిలోబడి దైవమునకుమారుగ నాతనిపూజించిరి— అతడు మతమునునిమిత్తముగ పెట్టుకొని రాజకీయముగ ప్రజలనులోబరుచుకొనెను— అతడు సేవలను సజీవముగ పాతిపెట్టించెను— కాల్పించెను— తలలపైమేకుల గొట్టించెను— శరీరములు ఖండఖండములగునట్లు నరికించెను—ఈవిధముగ నాస్తికత్వమును వ్యాపింపజేసి తనయాధిక్యతను నిల్పుకొనెను—

అకాలములో జనులందరు నొకేభాషమాటాడుచుండిరి— నమ్రూదు నియంతయొక్క దౌర్జన్యములు మితిమీరగా దేవుడు వారిభాషలలో భిన్నత్వమునుకల్గించెను— అందుపైజనులు పరస్పరకలహములకులోనైరి నమ్రూదునురాజ్య విచ్ఛిత్తికలిగెను— నియంతలరాజ్యాల కన్నిటికిని యిట్టిపరిణామమేకలుగునని ౪౦౦౦ యేండ్లనాటి నమ్రూదుచరిత్ర విశదముచేయుచున్నది"

# హిట్లరు ముందు ఎత్తులేవి?

డెయిలీమెయిలలో "లా" అనుసైన్యవాయుపలిట్టు వ్రాసినారు.

గ్రీసుదేశమునకుసంబధించిన చిన్నచిన్నద్వీపాలనుహిట్లరుఆక్రమించుకున్న తర్వాతఅతడేమియెత్తులువేయునో బయటపడును.

టర్కీతీరసమీపములోఉండే లెమ్నాస్,సామోథ్రేస్, లెస్బాస్, చియోస్అనుద్వీపాలు క్రీటుద్వీపానికి ౧౫౦మైళ్ళదూరంలోఉన్నవి. వాటినిహిట్లరుఆక్రమించుకొన్నట్లు తెలిసినది.

చియోస్‌ద్వీపము ముందురోజులను విశదపరుపగలరు అదిస్మిర్నాద్వీపాన్నిరక్షించేద్వీపము దీనిద్వారానేపూర్వము దండయాత్రలు జరిగియుండెను

కొన్నిదినాలక్రిందటనే టర్కీ మంత్రియగు ఇనోనూగారు స్మిర్నారక్షణకు ఏర్పాట్లనుపరిశీలించియుండిరి. డ్రెడానియాల్ ముఖానికి ఉండే లెమ్నాస్‌ద్వీపాన్ని హిట్లరుపట్టుకొన్నందున మంత్రిఇనోనూగారికి తొందరఎక్కువైనది. ఇటలీవారివద్దఇంకాచాలా ఓడలున్నవి. వాటినిపెపిలస్ నుండిఏథెన్సువరకుపంపవచ్చును. వీటిలోహిట్లరు మూలబలాన్ని ఏథెన్సునుండి ౧౫౦మైళ్లదూరంలో ఉండేచియోస్‌ద్వీపానికి పంపవచ్చును. అచ్చటినుండి౧౦మైళ్లదూరములోఉండే స్మిర్నాద్వీపానికిపంపవచ్చును ఈనావలకు సహాయముగా బాంబులవిమానాలు ఈచిన్నచిన్నదీవులపై ఆగుచుఎగురుచుఉండగా వచ్చుచుండును,

బల్కాసులోనికాలో సైన్యాన్ని దింపుదురు లేదాడ్రెడానియాలను వదలివేసి జర్మనులు ప్రక్కదొంటపట్టవచ్చును అప్పుడుస్మిర్నాయేవారికి ముఖ్యమగుస్థలమగును ఇదినాజీసైన్యాలకుదిడ్డిదారివలెపనియిచ్చును. దీనిద్వారా మహావేగముగా తమసైన్యాలను ఈరాఖుప్రాంతాలకు పంపవచ్చును ఆట్లుభూమిపైకాలుపెట్టినతర్వాత నాజీలుతమటాంకు మారణయంత్రాలను శైబ్లైదయి క్యాంగిరియాలోచేరి బగ్దాదుమీదపడవచ్చును పూర్వయుద్ధములోకూడ కైజర్ ఇదే ప్లాను వేసియుండెను ఇట్లుజరిగినచో టర్కీయుద్ధములోనికిదిగవలసివచ్చును. లేదా జర్మను టర్కీజోలికే పోకుండగా సిరియాలో తమసైన్యాలను దించవచ్చును

ప్రతేఇంగ్లీషువారు సిరియావద్దనేఉన్నసైన్యాన్ని తమవశములో పెట్టుకొనియున్నారు ప్రాంతములోని అలెగ్జాండ్రియాలోవున్న ఇంగ్లీషు యుద్ధనావలున్నవి. అయితేగ్రీకుదేశపుసముద్రములో జర్మనువిమానాలకు అనుకూలతఏర్పడినది చిన్నచిన్నదీవిగడ్డలుండుటచేతవారివిమానాలు కప్పగంతులువేసుకుంటూ రాగలవు హిట్లరు బహుశాటర్కీపై యుద్ధముచేయును, బలీయమైనతావులనువదలి బలహీనపు తావులనేఅతడుఎదురించు చాకచక్యముకలవాడు అయితే ఒకటిమాత్రముగమనించదగినది, యుగోస్లావియాప్రాంతాలలో హిట్లరు౧౦లక్షల జర్మనుసేననునింపిపట్టినాడు, దానినివినియోగించకుండా ఉండజాలడు ముందేమిఎత్తువేయునో?

## బొంబాయి అల్లరులు మరల ఎక్కువగుట

బొంబాయినగరమున నిన్న పలుచోట్ల కత్తిపోట్లుసంభవించినందున ఉద్రేకము హెచ్చినది, నిన్న రాత్రి౧౦నుండి నేటి ఉదయం ౯గంటలలోగా మరి౫గురుకత్తితో పొడువబడినట్లు తెలుపబడుచున్నది— కర్ఫ్యూఉత్తరవు అమలులోనుండు ప్రదేశమునకుఅవలయుండే కార్మికులస్థానమగు లాల్ బాగులో నిన్న రాత్రి ప్రొద్దుపోయినతర్వాతకొందరుహిందువులు ముస్లిములుఒకరిపైనొకరు రాళ్లురువ్వుకొనిరి— పోలీసులువచ్చి మూకనుచెదరగొట్టవలసివచ్చెను— సాంఘికకలహాలుతిరిగి ప్రారంభమైనతరువాత మొదటిపర్యాయముగా ఫోర్టు ఏరియాలో ఒకచిన్నఅంగడి తగులబెట్టబడెను— మరొకక్షతగాత్రుడు ఆసుపత్రిలోమరణించెను— దీనితోచనిపోయినవారిమొత్తం సఖ్యరం గాయపడ్డవారిసంఖ్య ౨౨౦, మే౧౪వతేది మధ్యాహ్నం, మరునాడుప్రొద్దున కొంతవరకు బాగుపడినట్లున్న అల్లరులస్థితి చెడుపాడయ్యెను. కత్తితో పొడువబడి ముగ్గురు చనిపోయిరి ఇంకొకమంది కత్తిపోట్లతో ఆసుపత్రిలోచేర్చబడిరి. దీనితో చంపబడ్డవారిసంఖ్య ౩౭. గాయపడ్డవారి సంఖ్య ౨౧౩యగుచున్నది—

సాయంత్రమున నొకపాదరక్షల దుకాణము తలుపును తుంటరులు విరుగగొట్టిలోనిసామానును అంతయును వీధిలో పడవేసిరి—

మిలిటరీ లారీలు సాయుధపోలీసులు కావలా కాయుచున్నారు,

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౩౦-౮-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము

ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | | |
|---|---|---|---|---|
| | రూ | అ | పై | |
| కిచిడీ సాంబర్లు | ౨౦ నుండి ౨౧ | | | |
| నంబర్లు | ౨౩ | ౦ | ౦ | |
| ఢిల్లీభోగాలు | ౨౩ | ౦ | ౦ | |
| రాంసాగర్లు | ౧౭ | ౮ | ౦ | |
| నానక్రాం | ౧౮ | ౪ | ౦ | క్రొత్తవి |
| ,, | ౨౧ | ౮ | ౦ | పాతవి |
| అర్కాటి | ౧౮ | ౦ | ౦ | క్రొత్తవి |
| ,, | ౨౨ | ౦ | ౦ | పాతవి |
| జోనామణి | ౧౬ నుండి ౧౭ | | | |
| బుకుములు | ౧౫ | ౦ | ౦ | |
| జేనారి | ౧౯ | ౦ | ౦ | |
| **గోధుమలు** | | | | |
| షర్బతి | ౧౬ | ౮ | ౦ | |
| బన్సీ | ౧౬ | ౦ | ౦ | |
| లక్ష్మీ | ౧౯ | ౮ | ౦ | |
| పోటియా | ౧౫ | ౦ | ౦ | |
| ఎర్రగోధుములు | ౧౪ | ౮ | ౦ | |
| **జొన్నలు** | | | | |
| తెల్ల జొన్నలు | ౭ | ౮ | ౦ | |
| పచ్చ జొన్నలు | ౭ | ౮ | ౦ | |
| మడికట్టు జొన్నలు | ౬ | ౧౨ | ౦ | |
| సెనగలు | ౧౪ | ౮ | ౦ | |
| కందులు | ౮ | ౮ | ౦ | |
| మినుములు | ౧౦ | ౯ | ౦ | |
| అంకలు | ౧౨ | ౮ | ౦ | |
| సజ్జలు | ౬ | ౪ | ౦ | |
| **పప్పులు** | | | | |
| సెనగ పప్పు | ౧౮ | ౮ | ౦ | |
| కంది ,, | ౧౪ | ౦ | ౦ | |
| పిరిసెనగ,, | ౧౭ | ౮ | ౦ | |
| లంక ,, | ౧౫ | ౪ | ౦ | |
| మినప ,, | ౧౬ | ౮ | ౦ | |
| పెసర , | ౧౮ | ౮ | ౦ | |
| బెల్లము ౮ ౮ ౦ | ౭ | ౦ | ౦ | |
| ఉప్పు | ౧౨ | ౧౩ | ౦ | |
| వుల్లిగడ్డ ౮ ౮ ౦ నుంచి | ౭ | ౯ | ౦ | వరకు |
| తెల్లగడుగు ౧౨ నుంచి ౨౦ వరకు | | | | |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజాము షాదు , ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎర్రచక్కెర ,, పల్ల | ౧౩,౧౨ | ౮ | ౦ | |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౯ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౧౩ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౪ | ౦ | ౦ | |
| మణుము ౧౨ సే. | | | | |
| కొబ్బెరనూనె ,, | ౪ | ౮ | ౦ | |
| కుసుమనూనె ,, | ౩ | ౪ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౮ | ౦ | |
| కిరోసిన్ (గ్యాస్, ,, డబ్బా ౧కి | | | | |
| **నెయ్యి** మణుము ౪౦ సేర్లు | | | | |
| బిదరు నెయ్యి ,, | ౪౨ | ౦ | ౦ | |
| తెలంగానా ,, | ౩౭ | ౦ | ౦ | |
| వనస్పతి,డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు॥ ౧కి | ౫౦ | ౮ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౬౨ | ౪ | ౦ | |
| ,, తు ౧కి | ౦ | ౧౧ | ౯ | |
| సవరన్ ౧కికల్దారు రూ. | ౨౮ | ౮ | ౦ | |
| **మారకం** | | | | |
| హాలీకి కల్దార్లు | ౧౯ | ౯ | ౦ | |
| కల్దారుకు హాలీలు | ౧౯ | ౫ | ౦ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ ,, | ౮ | ౪ | ౦ | |
| బుడ్డలు పల్లా ౧కి | ౮ | ౪ | ౦ | |
| పప్పు ,, | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:—

ధరలు నీశైనంతవరకు సరియైనవిగా తెలుపుచుంటిమి— అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులు కాజాలరు,

# కాంగ్రెసు సత్యాగ్రహము

## సత్యాగ్రహోద్యమమునకు ముందుదారి

సత్యాగ్రహోద్యమముయొక్క భవిష్యత్ప్రణాళికవిషయమున అధికారయుక్తమగు నొకప్రకటనను త్వరలో వెలువరింతునని గాంధిగారు కర్ణాటకరాష్ట్ర కాంగ్రెసుకమిటీ అధ్యక్షునకు తెలిపిరి.

పత్రికలలో ప్రచురింపబడు అసత్య ప్రచారములవల్ల లోకమునకుకలుగు పొరపాటు అభిప్రాయములను తొలగించుటకై యీ స్టేటుమెంటు అవసరము.

### నెహ్రూగారి వాజ్మూలము

మే౧౪వతేదీన అలహాబాదులో, గోరక్‌పూరు మేజస్ట్రేటుకు పండిత జవహర్లాలుగారు వ్రాతమూలకముగనిచ్చిన వాజ్మూలపు ప్రతులు కొందరివద్దదొరికినందున వారికి శిక్షలు జుర్మానాలును విధించిరి

### ఆస్తి వేలము

సత్యాగ్రహమొనర్చి జైలుశిక్ష అనుభవించుచున్న అనుముల రామగోవిందశర్మ (కోణకంచి) గారికివిధించిన జుర్మానావసూలుకై వారియింట్లో కొంతచరాస్తిని, స్థిరాస్తిని వేలమువేసెదమని కోణకంచి చుట్టుపట్టుగ్రామాలలో మే ౨౮వతేదిన ప్రకటించి, ౨౯వతేదిన వేలముపాడించుటకు ఎంతప్రయత్నముచేసినను, పాటదారులుదొరకనందున తుదకాప్రయత్నము నే మానుకొన్నారు.

సత్యాగ్రహం చేయుచు ఢిల్లీకి పోవుచుండు యాగంటి రామలింగంగారిని నాగపూరు ప్రాంతంలో అరెస్టుచేసి తిరిగ అతనిజిల్లాయగు నెల్లూరికి చేర్చినారు.

### సత్యాగ్రహుల విడుదలలు

పంజాబులో లాహోరు హైకోర్టువారు సత్యాగ్రహులనుగూర్చిన ఒకకేసులో సత్యాగ్రహము చేసెదమని ముందుగా నోటీసునుయిచ్చినంతమాత్రానికే దేశరక్షణనియమాలక్రింద శిక్ష విధించుటకువీలులేదని తీర్పునిచ్చినందువల్ల పంజాబు ప్రభుత్వమువారు తమరాష్ట్రింలో ఈవిధంగా శిక్ష పొందినసత్యాగ్రహులను విడుదలచేయుటకు యత్నించుచున్నారు సంయుక్తరాష్ట్రములలో కూడ ఇట్టియత్నములే జరుగుచున్నవి.

## గోలకొండ గ్రంథాలయం

**మాక్మిలన్ తెలుగు వాచకములు**

ఒకటవ, రెండవ, మూడవ, నాల్గవ, అయిదవ, ఆరవ, ఏడవ, వాచకపుస్తకములు.
ప్రకాశకులు — మాక్మిలన్ కంపెని మద్రాసు:-

మాకు పైప్రకాశకులు బళ్లలో తెనుగు బాలబాలికలు చదివిందుటకు ఏర్పాటు అయియున్న తెనుగువాచకాలు 8పుస్తకములు—అనగా ఒకటవ వాచకమునుండి 8వవాచకమువరకు విమర్శనార్థ పంపినారు.

ఈవాచకాలు పూర్వము సకలాంధ్రములో అఖండవిఖ్యాతుడైయుండిన రా౹౹ ౹౹ కందుకూరి వీరేశలింగము పంతులుగారిచే రచింపబడియుండినట్టిది. వీరేశలింగంగారిపేరు ఆంధ్రభాషకు మంత్రరాజమువంటిది. వారు తెనుగుసాహిత్యములో సిద్ధహస్తులు. అట్టివారి రచనలలో లోపములుండుట అటేపనిగావని పెట్టుకొని వెదకువారి కేమాతనైన ఏదైనా దొరికితే దొరకవచ్చునేమో! అది అప్రధానాంశము.

అయితే శ్రీ కందుకూరివారు స్వర్గవాసులై బహుకాలమయ్యెను. కాలముమారినందున అధునికవిషయాలందుఉండుట అవసరము. అందుచేత కొత్తవిషయాలు చేర్చి పాతపడిపోయినవిషయాలు తీసివేసి సంస్కరించి నూతనరూప మిచ్చుటకై ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారిని మాక్మిలన్ కంపెనీవారు కోరిరి. సుబ్బారావుగారీపని స్వీకరించి సంస్కరించి నూతనవిషయాలను,పద్యాలను చేర్చియిచ్చిన దులకు కంపెనీవారు ధన్యులైనారు.

ఈవాచకాలు ముఖ్యముగా నిజాంరాష్ట్రానికి పనికివచ్చును. ఇచ్చటి శ్రీ మ. ఘ. వ. ప్రభువులంగారియొక్కయు మహామేధావి సైరు అక్బర్ గారియొక్కయు సర్ సాలార్జంగు మరి యితరమహాపురుషులయొక్కయు జీవితాలు వ్రాసినారు. ఆంధ్ర ప్రాచీనాధునాతన మహావీరుల యొక్కయు మహాపురుషులయొక్కయు, కవుల యొక్కయు జీవితాలుకూడా యీవాచకాలలో చేర్చినారు.

శైలివిషయమై యొక్కమాట చెప్పవలసి యున్నది. బాలురకు ప్రాథమికదశలో సంధులను దృశ్యముమీదరూపాలను, అర్థముకానిదై యుండును. ఇందువిసంధులు చేసూపించినారు. ఆదిమంచి

**నెహ్రూచరిత్రము**

గ్రంథకర్త కొమాండూరి శఠకోపాచార్యులుగారు, వకీలు కాకినాడ,
౧౯౩౬—౧౯౩౭ సంవత్సరములలో ప్రథమద్వితీయ ముద్రణములైనది, మరల యీవత్సరము మూడవసారి ముద్రింపబడినది, దీనివెలకల్దారు రూ. ౨—౦—౦ పుటలు ౨౦౦ కాగితముగ్లేజు. గ్రంథకర్తదగ్గరనే దొరుకును

త్యాగశీలురు, దేశసేవాధురీణుడు, మేధానిధియగు జవాహరు నెహ్రూయొక్క జీవిత చరిత్ర మిందువిపులముగ వర్ణింపబడినది. ఈమహనీయుని ప్రపంచపర్యటనము, బాల్యమునుండి రాజకీయ విషయములలో నీయనకుగలయభిరుచి, యనేక సంస్థలయందుగల యుగ్రగణ్యత్వప్రభుత్వమునకును కనియభినివేశాదులిందు స్పష్టముగ వ్రాయబడినవి

మొదటిరెండుకూర్పులకంటె నీమూడవ కూర్పునందు, నేషనల్ ప్లానింగు, సంస్థానసమస్య, అంతర్జాతీయస్థితి, ప్రస్తుతయుద్ధము మొదలగుకొన్ని క్రొత్తవిషయములను, మరికొన్ని క్రొత్తచిత్రపటములను చేర్చినట్లుగ్రంథకర్తగారు తమభూమికలో వ్రాసినారు మరియుమొదటిరెండు కూర్పుల కంటెనీకూర్పునందు శైలినికూడ సంస్కరించినట్లుగ్రంథకర్తగారిభూమికలో వ్రాయబడినది. అనర్ఘచరిత్రుడగు నీమహనీయుని జీవితగ్రంథమగు దీనినిప్రతివారును చదివి తమజీవితమును దిద్దుకొనవచ్చును

గ్రంథకర్తగారుఏతాదృశగ్రంథరచనానిష్ణాతులనుటయెల్లరకువిశదమే దేశీయసోదరీ సోదరులు దీనిని చదివి జీవితమునలాభములపొందుదురుగాక!

---

పద్ధతి భాషకూడా సులభముగానున్నది.

విషయాలు వివిధములును విజ్ఞాన బోధకములులును ఉపయుక్తములు నైయున్నవి మాక్మిలన్ కంపెనీవారట్టి గ్రంథాలను ప్రకటించినందులకు ప్రశంసాపాత్రులు.

అయితేమువపత్రముపై టాజిమహాల్ కుమారుగా నిజాంరాష్ట్రములో అజంటా ఎల్లోరా చిత్రమోలేక ఓరుగల్లుప్రాచీనద్వారమో అట్టిదేనో రాష్ట్రమునలోనిది ముద్రించియుండిన బాగుండును.

---

## పద్దెనిమిదియేండ్ల పిల్లవాడు పలాయనం

పెంబర్తి, తేది ౨౮

స్టేషన్ పెంబర్తి (జాగీరు)లోవున్న వైశ్యకులజుండైన రేపాలలక్ష్మయ్యఅను వొకబీదకుటుంబీకుడుయుండెను- ఇతని జీవనోపాధి యంతయు రెడ్డెద్దులబండిపైన ఆధారపడియుండెను. నేటికి మాసముక్రిందట హైద్రాబాద నివాసియైన గొట్టిపల్ల వీరభద్రయ్యఅనే ఆరాధ్యులు సంచారముచేయుచు శిద్దాంకినుండి వీరియింటికివచ్చియుండిరి (శిష్యుడుకావున) రెండు రోజులు సత్కరించినతదుపరి, జీడికంటిసమీపమందున్న బుదుజాబావివద్ద తోలించిరమ్మని గురువుగారు శిష్యునిఆడుగగా తనకొమారుడైన నర్సయ్యఅను ౧౮ యేండ్ల పిల్లవాన్ని వెంబడిచ్చి బండిపైనపంపిరి నేటికి ౨౭ రోజులుఅయెను. ఇంతవరకు వారు యేటికిపోయినది జాడతెలియక మాతాపితరులు శోకసముద్రమునమునుగుచున్నారు దయామయులగు ప్రభుత్వమువారైనను పాఠకమహాశయులైనను దయుదలంచి వీరభద్రయ్యగారికి తగినబుద్ధిచెప్పి బండిని పిల్లవానిని వెంటచేతోలించగలరు.

ఇట్లు
యెనిశెట్టి వెంకయగుప్త

---

## రాష్ట్రపత్రికలు తప్పుడు ప్రచారము

హైదరాబాదు (దక్కన్) జూను 3

ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు:

"కొంతకాలమునుండి కొన్ని స్థానికపత్రికలలో విశేషసంవ్రాతల శీర్షికలతో అనవసరముగా కొందరి ప్రభుత్వాధికారులను స్తుతించుటలేక అన్యాయముగా విమర్శించుట కానవచ్చుచున్నది అనేకసందర్భాలలో ఈవిమర్శలు అజ్ఞానమూలకములైనవి. లేదా వ్యక్తిగత దుర్బుద్ధులకు లేక స్వార్థతకులనైయుండును. కొన్నివేళల అధికారులే లోనలోన కచ్చేరీలోని అంతరంగిక విషయాలనువ్రాయించి ఇతరులకు తెలియజాలని విషయాలను ప్రకటించుటవలన వారిచేయికవలబడుచున్నది. ఇదిఉద్యోగశిక్షణమునకు విరుద్ధమగుపద్ధతి. ఒకఉద్యోగినిఇబ్బందిపెట్టేఉద్దేశముతో ప్రభుత్వమువారు చేయుమంచిపనులలో ఆయుద్యోగి శ్రద్ధతీసుకొనుచుండినను అట్టివానిని పురస్కరించుకొని మంచిపనినికూడా తప్పుపట్టుట కానవచ్చినది. ఉద్యోగులను నియమించే కాలమువచ్చినపుడు పత్రికలవారే కొందరివ్యక్తులపేరులను సూచించుచుందురు. తమవిలేఖకులు పంపినారని నిరాధారమగువ్రాతలను పురస్కరించుకొని సంపాదకీయాలుకూడా వ్రాసిచేయుదురు. ఈ పద్ధతి వ్యాపించుకొనిపోయినప్రమాదకరముగురూపాలనుదాల్చగలదు ఇటీవల ప్రభుత్వోద్యోగుల మార్పులనుగురించి, శిక్షలనుగురించి విశేషములవార్తలక్రింద కొన్ని అభిప్రాయప్రకటనలు విదితమైనవి. ఒకఉద్యోగి ఒకమతమువాడగుటచేతనే అతనిపై విరుద్ధప్రచారమును కొన్నిపత్రికలుచేయుచున్నవి, అది అత్యంతప్రమాదకరమగుపద్ధతి మరికొన్నితావులలో అధికారులను బెదిరించుట లేకవారిపైప్రభావమువేయుటకానవచ్చినది. అట్లుచేయుటచేతవారిని ప్రజలదృష్టిలో తక్కువవారినిగా చేయుటయేలేక ప్రజాదరణమునుపొందుటకై విమర్శకులకు లోబడినవారినిగాచేయుటయో సంభవించును. ఇట్టివార్తప్రచారము పరిపాలనకు భంగకరమును వార్తపత్రికల గౌరవమునకును భంగకరమునునైయున్నది. ఇట్టివి ముందుసంభవింపకుండునుగాక. ప్రభుత్వమువారిట్టివ్రాతలను లక్ష్యపెట్టరు, సరియైననియమములకు బద్ధమై పత్రికలు పక్రమాందోళనము చేయుటవేరుమాట.దానికిని దీనికిని సంబంధములేదు.

---



---

## కళా సంఘము

హైదరాబాదు (దక్కన్) 30-౫-౪౧

హైదరాబాదునగరమునందు "హైదరాబాదులలిత కళాసంఘము" (Hyderabad fine arts society) అనుపేర నొకసంఘము శ్రీ రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి ఓ బి యి వారి ఆధ్యక్షతను ఇటీవల స్థాపించబడినది. దీనికిపలు ప్రముఖులు ఉపాధ్యక్షులుగను కార్యనిర్వాహకసభ్యులుగను ఎన్నుకొనబడిరి ఈ సంఘము యొక్క ఉద్దేశ్యములలో ముఖ్యములగునవి. గానకళ, నాట్యకళ మొదలగు కళలను ప్రోత్సహించుట. అవకాశమునుబట్టి కళాప్రదర్శనములను ఏర్పాటుచేయుట, లలితకళలనుగూర్చిన గ్రంథము లనుసేకరించి యొకగ్రంథాలయమును స్థాపించుట కళలనుగురించి ఉపన్యాసముల నిప్పించుట, సంగీతమును నేర్పించుటకై పాఠశాలను స్థాపించుట మొదలగునవి. ఈసంఘమునందు ఇప్పుడే నూటికిపైగా సభ్యులుచేరియున్నారు. సంఘముయొక్క ప్రారంభోత్సవమును ఆకర్షణీయమగుపద్ధతిపై త్వరలోజరుపుటకు ఏర్పాట్లుజరుగుచున్నవి. సోదరసోదరీమణులు సంఘమునందుచేరి దీనికి తగిన ప్రోత్సాహమునొసంగ ప్రార్థితులు.

గాడేపల్లి సూర్యప్రకాశరావు
వారణాసి సుబ్బారావు
సంయుక్తకార్యదర్శులు.

---

## నిర్బంధితుల స్థితి

కరీంనగరం ౨౭-౫-౧౯౪౧.

ఇచ్చట ఇద్దరురాజకీయనిర్బంధితులగు వీరరువారగు శ్రీనివాసరావు మహల్లాకుగారును జీరంగాబాదు నివాసులైన వెంకటపాయముగారును జైలులో మూసివేయబడినారు. కొన్నిదినాలనుండి ప్రాతదారోగాపోయి క్రొత్తదారోగా వచ్చిననుండి నిర్బంధములు పెట్టుచున్నట్టు తెలియుచున్నది.

మొదటివారోగా ఉండగా చదువుటకు పత్రికలు ఇయ్యబడుచుండెను, కాని వీరువచ్చినప్పటినుండి అనగా దాదాపుఒకవారమునుండి పత్రికలివ్వడము పూర్తిగాఆపివేసినారు తోటలో సాయంకాలము తిరుగుటకు అనుజ్ఞ యియ్యబడుచుండెనుకానిఅదికూడ ఇతడుఆపివేసినారు ఇంకా కష్టములు పెట్టుచున్నట్లు ప్రజలమైనవార్తలు వచ్చినవి. దారోగాగారి ఈచర్యలనుగురించి ప్రభుత్వమువారు తగినచర్యతీసికొనగలరని ప్రార్థన.

---

## లండన్‌లోని రక్షణ సైన్యములకు హార్లిక్సు వారిచే ఉచితముగా చిత్ర ప్రదర్శనములు

ఇంగ్లాండునందలి హార్లిక్సు లిమిటెడ్ వారు లండన్ నగరమందలి పశ్చిమభాగమునగల ఒక నాటకమందిరమున ప్రతిదినమును మూడుగంటలకాలము వినోదప్రదర్శనములు చేయుచున్నారు ఈనాటకశాలయందు ౧౨౦౦మందికూర్చుండుస్థలమున్నది. యివియన్నియుప్రత్యేకముగా దేశరక్షణకైయున్న సివిక,నావిక, సైనిక విమానదళములవారికిని అందలి స్త్రీలశాఖలకు ఏర్పాటు చేయబడినవి

ఈ వినోదప్రదర్శనములందు, చలనచిత్రములు ఆర్కెస్ట్రా, నాటకములు సంగీతము వగైరాలు దును ఆదివారములందు ప్రత్యేకముగాఅరగంటవరకు దేశమునందలి ఉత్తమోత్తమ సినీతారలప్రదర్శనములు ఏర్పాటుచేయబడును దీనిసాముఖ్యతనుబట్టి బి. బి. సి.ద్వారా బ్రాడ్కాస్టుగూడా చేయుచున్నారు.

ఈకార్యక్రమమంతయు చాలాజయప్రదముగాజరుగుచున్నదని, లండన్ వారు హార్లిక్సుప్రకటనలు జరుపుచున్న జె-వాల్టర్ తాంసన్ కంపెనీవారు తెలుపుచున్నారు ప్రతిదినము నాట్యశాలనిండిపోవుచున్నది

నిజాంరాష్ట్ర

# అష్టమాంధ్ర మహిళా మహాసభ.

## శ్రీమతి రంగష్మ ఓబలరెడ్డిగారి అధ్యక్షోపన్యాసము.

౩౦ వ తేదీన చిలుకూరులో సమావేశమైన నిజాంరాష్ట్ర అష్టమాంధ్రమహాసభయందు ఆహ్వాన సంఘాధ్యక్షురాలగు శ్రీమతి పులిజాల కమలాబాయిగారు ఉపన్యసించిన తర్వాత, అధ్యక్షురాలగు శ్రీమతి రంగమ్మరెడ్డిగారు ఉపన్యసించిరి-

౩౦ తీరునాడు చిలుకూరులో జరిగిన ఎనిమిదవ ఆంధ్ర మహిళామహాసభాధ్యక్షత వహించిన శ్రీమతి రంగమ్మగారు ఈక్రిందివిధముగా తమ ఉపన్యాసమును చదివిరి.

సోదరీ ప్రతినిధులారా!

మన రాష్ట్రములో ఆంధ్రుల సంఖ్య ఇంచుమించు సగము భాగమైయున్నది. వారిలో రమారమి సగముభాగము ఆంధ్రస్త్రీలైయున్నారు. అనగా సుమారు ౪౦ లక్షల తెలుగుస్త్రీలకు సంబంధించు సమస్యలను మనము చర్చించువారమై యున్నాము. ఇంతటిగొప్ప జనసంఖ్యగల స్త్రీలలో మన దురదృష్టమో అశక్తతనో లేక మరియేకారణమో కానిఏదిక్కు చూచినను లోపములు, అవిద్య, అంధకారము, మూఢవిశ్వాసము, ఆత్మవిశ్వాసరాహిత్యము, అనారోగ్యము, ఆయుక్షీణత, సాంఘిక దురాచారములు, అత్యాచారములు, దిక్కులేనితనము, ఇట్టివెన్నని చెప్పవలెను. తండోపతండములుగ వ్యక్తమగుచున్నవి.

విద్య

అన్నిలోపాలకు మూల కారణము అవిద్య. విద్యాసమస్యను మనము పరిష్కరించిన అదియే యితరసమస్యలనన్నింటిని పరిష్కరించి తీరును.

"విద్యావతీ ధర్మపరాయణా స్త్రీ
లోకేవరాణాం రమణీయ రత్నం."

కేవలము విద్యవచ్చుటయేకాదు దానితోపాటుగ ధర్మబుద్ధిగలిగియుండిన స్త్రీ ప్రపంచములోని మానవవర్గములో రమణీయమైన రత్నమని చెప్పినారు పెద్దలు. స్త్రీవిద్య మనరాష్ట్రములో చాలాహీనస్థితిలోనున్నది? హైద్రాబాదు రాష్ట్రములోని మొత్తం జనసంఖ్య ౧౯౩౧ వ జనాభాప్రకారము ౧ కోటి ౪౧ లక్ష ౭౬ వేల ౩౧౩. అందులో స్త్రీల సంఖ్య ౭౦ లక్షల ౩౭వేల ౪౩. ఇంచు మించు ౭౦ లక్షల స్త్రీలలో చదువను వ్రాయను నేర్చినవారిసంఖ్య ఈ ౧౯౩౧ జనాభాప్రకారము ౧ లక్ష ౭౧ వేల ౭౦౧. ప్రతి ౪౭ మందిలో చదువనేర్చిన స్త్రీ ఒక్కతె ప్రకారమున్నదని విశదమగును. ప్రభుత్వమువారు బాలికలవిద్యావిషయములో ఉదారత చూపించవలసి యుండును. ఇంతవరకు ఉర్దూలోను ఇంగ్లీషులోను ఉన్నత పాఠశాల లన్నింటిలో స్త్రీలకు కూడ విద్యచెప్పించుచు వచ్చిరి. ప్రజాప్రముఖు లాందోళనముచేయగా మాధ్యమికతరగతివరకు మాతృభాషలో బాలికలకు విద్యచెప్పించ వచ్చుననిఒకదిక్కు సెలవిచ్చుచు ఇంకొకదిక్కు ఉర్దూను నిర్బంధ ద్వితీయభాషగ నేర్పించవలెనని ప్రభుత్వమువా రాజ్ఞాపించిరి. బాలికలపై నిర్బంధముంచిన వారికి మాతృభాషయందైన ప్రవేశముండదు. అన్యభాషయందైన పాండిత్యము కలుగనేరదు. కావున ఉర్దూనిర్బంధాన్ని వెంటనేతొలగించవలెనని ప్రభుత్వమువారిమనస్సు కరుగునట్లుగ మనమందరము ప్రార్థించవలెను.

మన అవసరములు

ఇప్పటిస్థితిలో భారతీయ స్త్రీలలో నూటికి ౯౦ మంది సాంఘికముగాను ఆర్థికముగాను పనికిరానివారై యున్నారు. మూఢవిశ్వాసములు పురుషులలో కన్న స్త్రీలలోనే ఎక్కువయేమో అని అనిపించుచున్నది. ఆరోగ్యవిధులు, చక్కగ తెలియనందున తమపిల్లలు విశేషముగ రోగ పీడితులగుచున్నారు. వికలాంగులగుచున్నారు, చనిపోవుచున్నారు. తమపిల్లలకు రోగములువచ్చిన వైద్యులవద్దకు పోవుటకుమారుగ భూతములుపారదోలువారిని, దిగతీయువారిని, దృష్టిదోషము పోగొట్టువారిని, ఎరుకల శోస్యము చెప్పువారిని, కోళ్లనుచంపు మంత్రగాళ్లను, యంత్రాలకు ధూపమెక్కించి మెడలనిండుగ మోతచేటుగా కట్టువారిని పిలిపించి నష్టపడి దుఃఖపడుదురు. తమకు సంతానములేకుండిన ప్రాణాచారము చేయుటకు కొనుదీయరు. ఇక ప్రసవకాలములందు మనలోచాలమంది స్త్రీలుపాటిచు ఆచారాలు తల్లిపిల్లలప్రాణాలకే ముప్పు తెచ్చిపెట్టునట్టివై యున్నవి.

మనము సొమ్ములపై తక్కువగ వ్యయముచేయవలెను. బిడ్డల పోషణపై ఎక్కువ వ్యయము చేయవలెను. మూఢవిశ్వాసాలను వెంటనే వదులుకొనవలెను. ప్రతిగ్రామములో మంత్రసానులను ఇప్పటికాలపు వైద్యపద్ధతులపై శిక్షణమిచ్చి సిద్ధముచేయవలెను. ప్రతిబాలికకును ప్రతిస్త్రీకిని వ్యాయామ శిక్షణ మిప్పించవలెను. ప్రాథమిక చికిత్సలు నేర్పించుట.

శిశుపోషణ. రోగుల ఉపచారము.

గృహ పరిశ్రమలను విరివిగ స్త్రీలలో వ్యాపింపజేయుట. ఇప్పటికాలములో బీదస్త్రీలకు కూలీలు సరిగదొరకవు. రాటాలు ఏనాడో పొయ్యిలో పెట్టబడెను. ధనిక స్త్రీలు ఏమాత్రమును కష్టము చేయక సోమరులై కూర్చొనియుందురు. ఈ క్రిందిపరిశ్రమలను ఉదాహరణముగ సూచించు చున్నాను.

(అ) వడుకుట. (ఇ) చేతికుట్టు, మిషనుకుట్లు, (ఉ) చిత్రలేఖనము, బొమ్మలు చేయుట. (ఎ) అల్లుట, టోపీలు పయితాబులు, జంపర్లు, జోబీసంచులు, దిండుబట్టలు, మున్నగువానిపై నక్షీపనులు, మంచము నవారులు, జంకానాలు, ఛాదర్లు, చేయుట) (ఒ) అగ్గిపెట్టెలుచేయుట (ఔ) రంగులు అద్దకపుపనులు, (క) నెయ్యిచేసి అమ్ముట.

(చ) గాజులు వేయుట. చాలాప్రాంతాలలో ముత్తైదువని చేతులతో పరపురుషులువచ్చి గాజులుతొడిగించుచును గాజులను తొడిగించు వృత్తివలన అనేకమంది స్త్రీలకు జీవనాధారముకలుగును. స్త్రీలు స్త్రీలచేతనే గాజులు తొడిగించుకొనవలెను,

మన బీదలు

మన ధనికులైనవారు బీదలనుగురించి శ్రద్ధతీసుకొనినట్లు కానరాదు. స్త్రీలలో బీదలైనవారి కష్టాలను వినినచో మనకు హృదయముండినచో తప్పక పశ్చాత్తాప పడగలము. ధనికస్త్రీలు తమసొమ్ములకు తమ పట్టుజలతారు చీర రవికలకు దినదినము మారే ఫ్యాషనులకు అందచందాలకు అవసరమగు ఆధునిక వ్యయయుక్తమైన వస్తువులపై వ్యయముచేయుచుందురు. బీదస్త్రీలు రెండవపూటకు తిండిలేక విచారించువారులేక కట్టుకొనుటకు రెండవకోకలేక కష్టములపాలగుచున్నారు. తక్కువకులాలవారిలోని స్త్రీలు త్రాగుడులో ఆరితేరినవారై దుర్భావలకు కలహాలకు లోనై తుదకు అప్పులపాలగుచున్నారు. హైద్రాబాదునగరములోని ఇట్టివర్గాలలోనిస్త్రీలు వేలకొలదిమంది చిల్లరఅప్పులుచేసి దినానికి రూపాయికి ఒకపైసా మొదలుకొని అణావరకు వడ్డీ నిచ్చుకొనుచు ఘోరకష్టాలనుఅనుభవించుచుండునది ఎందరెరుగుదురు? మనము బీదస్త్రీల జీవనస్థితులను విచారించుకొని వారినుద్ధరించకుండిన సంఘసేవ చేసినవారము కాజాలము.

శరణాలయములు

ఈబీదతనమేకాక మన సంఘములో కొన్ని బాల్యవివాహాల మూలాన బాలవితంతువులగుటచేతను వృద్ధ పురుషులు కాటికి కాళ్లుసాచినవారును సిగ్గులేక సంఘభయములేక పెండ్లిచేసుకొన దలచినప్పుడు నరరూప రాక్షసులు కొందరు తమకూతుండ్లను వారికి బలిదానముచేయుటచేతను స్త్రీలకు సరియగు శిక్షణమీయక పోవుటచేతను కొన్ని తావులలో వ్యభిచారవృత్తి నవలంబించుచున్నారు. దీనికంతయు మనసంఘమే బాధ్యత వహించునట్టిదై యున్నది. దురదృష్టవశముచేత అనాథలైనస్త్రీలు ఎందరోయున్నారు. వారినిరక్షించుభారము ప్రభుత్వమునాగే వహించవలసియుండెను. అదేమి కారణముచేతనో ప్రభుత్వమువారు అనాథ స్త్రీలనుగురించిన శాసనమేదియు చేసినట్లుకానరాదు. ఏదియెట్లున్నను ఇప్పుడు పూనాలోను, మద్రాసులోను సేవాసదనము లేర్పాటుచేసినట్లుగ మన తెలంగానాకును ఒకకేంద్రములో మంచిపద్ధతులపై సేవాసదనమునో లేక శరణాలయమునో (Rescue home) ఏర్పాటు చేయుట చాలఅవసరమని అభిప్రాయపడుచున్నాను.

సాంఘిక దుస్థితి

మన దురదృష్ట విశేషముచేత మన శాసనసభవారు బాల్యవివాహ నిషేధ శాసనమును ఎత్తివేసిరి. ఎత్తివేయుటకు ఓట్లునిచ్చినసభ్యులు ఎంతటిపూర్వకాలపువారో దీనివలన విశదమగుచున్నది. ప్రపంచమంతయు ఒక్కదిక్కు నడచుచుండగ ఈ ప్రాతకాలపు భావదాసులైన సభ్యులు ఇంకొకదిక్కునడచు చుండుట సంతాపహేతువేకాక హాస్యాస్పదమునునైయున్నది. బాల్యవివాహ శాసనము అగువరకు మనము మనమును ఏమాత్రమును తగ్గించుకొనరాదు.

పాశ్చాత్య ప్రభావము

ఆంగ్లేయులప్రభుత్వము పాదుకొన్న తర్వాత యూరపుదేశపుగాలి మన దేశముపై బాగావీచుచువచ్చినది. మనసాంప్రదాయాలను వదలుకొని మన ఏలికల పద్ధతులే బాగున్నవని వాటిని స్వీకరించుచున్నాము. యూరోపు జాతులలో ఎన్నియో ఉత్తమగుణాలున్నవి. వారి పట్టుదల, శ్రద్ధ, దేశభక్తి, త్యాగము, విజ్ఞానము, విద్యాప్రభావము, ఆరోగ్యము, పరిశుభ్రత, శిశుపోషణము, ఇట్టివెన్నియో మనము అనుకరించవలసియుండును. వాటినిమాని వారిఫ్యాషనులు, వారి కాస్మెటిక్కులు, మున్నగునవి వాడుచున్నాము. దమ్మిడీఖర్చులేక అందమును, ఆరోగ్యమును ప్రసాదించునట్టి మనగోరంటను వదలి రంగుడబ్బీలను తెప్పించుచున్నాము దీనివలన మనద్రవ్యము నష్టమగుచున్నది ఒక్కొక్కదేశానికి ఒక్కొక్కపద్ధతి సరిపోవును, ఒక్కొక్క దేశాని కొక్కొక్క ఆచారము అందముగ నుండును. అవిశీతోష్ణస్థితులనుబట్టియుండును. మన ప్రాచీన భారతీయస్త్రీలు విదుషీమణులైయుండిరి, కవులైయుండిరి. గొప్పవీరనారీమణులైయుండిరి. తేరిచూడజాలనట్టి పతివ్రతలైయుండిరి. మెగస్తనీసు అను గ్రీకురాయబారి మన దేశానికి చంద్రగుప్తచక్రవర్తికాలములో అనగా నేటికి ౨౨౫౦ ఏడ్లకుపూర్వము వచ్చియుండెను. అప్పుడు మనస్త్రీలనుచూచి "ఈదేశములో వ్యభిచారిణియైనస్త్రీ కానరాదు." అనియాశ్చర్యపడెను. ఈ నాడు మేయో మన దేశానికివచ్చి మనకిచ్చినట్టియున పనదును ఆమెవ్రాసిన మదరిండియాలో మనకువిశదమగును. ఒకకాలములో రాజపుత్రస్త్రీలును ఆంధ్ర మహారాష్ట్రస్త్రీలును వీరవనితలై యుద్ధములందు పాల్గొని శౌర్యమును ప్రకటించి ఆత్మగౌరవమును సంఘగౌరవమును కాపాడియుండిరి. ఈనాడు బెంగాలులోను, సరిహద్దుసూబాలలోను స్త్రీలను లేవనెత్తుకొని పోవుచున్నారను వార్తలనుచదువుచున్నాము. మతకలహాలు చెలరేగినకాలములలో స్త్రీల గౌరవాలు దక్కుట దుష్కరమై పోయినది. ఇంతటి కనిష్ఠదశకువచ్చుటయేల! ఈనాడు జపానుదేశములోని స్త్రీలు జూట్సూ అను కుస్తీపట్లను నేర్చుకొని మంచిమంచి పయిల్వానులను గూడ అవలీలగా పడగొట్టుచున్నారు. స్త్రీలను బలాఢ్యలనుగ జేసి ఆత్మరక్షణము చేసుకొను స్థితిలోనుంచుట చాల అవసరము. స్త్రీలకు సాము నేర్పింపవలెను. ఇప్పుడు మహారాష్ట్రములో ఈ పద్ధతిని ప్రారంభించినాడు. ఆంధ్రస్త్రీలును దానిని అనుకరించవలెను.

---

## అధ్యక్షోపన్యాసము

౮ వ పేజి తరువాయి

విరివిగానియమించుచు, ప్రభుత్వకార్య నిర్వహణ మునందు రాష్ట్రేతరుల సహాయము బొందుచు, ప్రజాహితకార్యములందు మాత్రమే రాష్ట్రేతరులను నిషేధించుటయు దుందుడుకుతనమును తెనుగ్రహింపజాలకున్నాను

పత్రికా స్వాతంత్ర్యము గూడ వాక్స్వాతంత్ర్యమువలెనే నిరోధింపబడుచున్నది ముఖ్యముగా దేశభాషలలో పత్రికా ప్రకటనకు అనుజ్ఞ దొరుకుట కష్టసాధ్యమైపోవుచున్నది. పత్రికల అనుజ్ఞ నొసగునపుడు అభివృద్ధికరము విధానము నవలంబించుటకుబదులు వ్యక్తులను, వ్యక్తుల యభిప్రాయములను బట్టి అనుజ్ఞ నొసగబడుచున్నది

ప్లేటుకాంగ్రెసుపై నిషేధమును తొలగించుటకు సగబడిన లిఖితపూర్వకమైన వాగ్దానము సంపూర్తింపబడలేదు రాష్ట్రమునందలి ఏడుగురు స్వాతంత్ర్యవీరులు ఈ నిషేధమును తొలగించు నుద్దేశముతో నేడు కారాగారశిక్షను అనుభవించుచున్నారనువిషయము మనము మరచిపోగూడదు. విచారణలేకయే యెందరో దేశసేవకులు నిర్బంధింపబడుచున్నారు. ఆంధ్రమహాసభ కార్యకారిణి సభ్యులలోనొకరగు శ్రీయుత బద్దం యెల్లారెడ్డిగారు యెట్టివిచారణలేకయే దిగ్బంధనములోనుంచబడిరి రైతుసేవకులగు శ్రీ పైడిపల్లి హనుమయ్య చౌదరిగారుగూడ యీవిధముగ నిర్బంధింపబడియున్నారు. అదాలతుయందుబహిరంగముగా విచారింపబడి, నిర్దోషులుగానెంచబడిన యిద్దరు ఖమ్మముయువకులు తిరిగి అరెస్టు గావింపబడిరి.

ఈనిరోధములన్నియు దేశమునందుపనిజేయు చున్న అభివృద్ధి శక్తులకొరకు మాత్రమే ఉద్దేశింపబడినట్లగపడుచున్నది. మతసాంఘిక శక్తులకు త్రోసి, వివిధమతావలంబకులలో విద్వేషముల పెంచు పతికారశక్తులు విచ్చలవిడిగా కార్యనిర్వహణ మొనరించుచున్నప్పటికి వానికాటంకముల నేవియు కల్పింపబడక పోవుట మనకనుభవనీయము.

### జాగీరు ప్రజలు

జాగీరుప్రజలస్థితి ఖాల్సాప్రజలకంటెను హీనముగానున్నది. ప్రజలొసగుపన్ను యంతయు తమ వ్యక్తివ్యయముల కే ఉపయోగించుటకని మాతన సిద్ధాంతమొకటి జాగీర్దారుల సంఘమువారు ప్రకటించియున్నారు. వీరితమజాగీర్ల అయవ్యయములను ప్రకటింపరు. ఖాల్సాప్రజలుచెల్లించు పన్నులకంటె యెక్కువపన్నులు జాగీరుప్రజలచేవసూలుగావింపబడుచున్నవి. ఎన్నియోజాగీర్లయందు బందోబస్తుగావింపబడక, పూర్వకాలపుగుండు గుత్తా ధావ్యపుకొల్లవసూలు గావింపబడుచున్నవి. ఈ ఇరువదియవశతాబ్దమువందుగూడ బందోబస్తుగాని ప్రజలు [illegible] దుఃఖింపవలసినవిషయము, బందోబస్తుజేయించు ప్రయత్నము అతిజాడ్యముగా జరుగుచున్నది

చట్టవిరుద్ధమగుపన్నులెన్నియో వసూలుగావింపబడుచున్నవి. అదాలతు, పోలీసు అధికారులు జాగీర్దారులకుండుటచే వాటినిజాగీర్దారులు దుర్వినియోగము జేసి అక్రమపన్నులు వసూలుచేయుట కుపయోగిస్తున్నారు.

జాగీర్లలో విద్యాభివృద్ధి, వైద్యసహాయము మిక్కిలితక్కువ జనసహాయమున్నవి

### వెట్టిచాకిరి

ప్రతిఫలమీయనిది వెట్టిచాకిరి చేయించుకొనుట ఎన్నియోసంవత్సరములక్రింద ప్రభువుగారి ఫర్మానుద్వారా స్పష్టమైననిబంధనలతో నిషేధింపబడినప్పటికిని, బీదప్రజలచే ప్రతిఫలమీయకయే వెట్టిచాకిరి జేయించుకొనుట నేటికి సహజముగా గ్రామములయందు జరుగుచునే యున్నది

వెట్టిచాకిరికి సంబంధించిన వేరొక విషయము మీతో మనవి జేయబోవుచున్నాను. ప్రభుత్వమువారు గావించిన వెట్టిచాకిరి నిబంధనలలో బలాత్కారముచే నిర్బంధముగా ప్రతిఫలమిచ్చి పనిదీసికొనుటకవకాశ మేర్పరుపబడి యున్నది. ప్రతిఫలమిచ్చినప్పటికి ఇష్టములేనిదే ఒకనిని నిర్బంధించుటగూడా ఒకవిధమైనబానిసత్వము (Slavery) అని నేను భావిస్తున్నాను

మన రాష్ట్రమునందు గ్రామముల సంఖ్య ౨౧౭౦౩౦. వీనిలో నేటికిని ౧౫౦౦౦ కంటెను అధికసంఖ్యగల గ్రామములయందు ప్రభుత్వపాఠశాలలు నెలకొల్పబడలేదు మనప్రభుత్వమువారు ఒక కోటికంటె నెక్కువ మొత్తము విద్యాశాఖపై వ్యయము గావించుచున్నప్పటికి దానిలోనుండి ఎక్కువభాగము ఉన్నతవిద్యకై ఉపయోగింపబడుచు, ౨౦లక్షలరూపాయలు మాత్రమే ప్రాథమిక విద్యపై ఖర్చగుచున్నది. ఒకవేయి జనసంఖ్యగల అన్నిగ్రామములయందును ప్రాథమిక పాఠశాలలు నెలకొల్పు క్రొత్తప్రణాళికవలన గూడా నిరక్షరాస్యతసమస్యా పరిష్కారముకాజాలదు ఈ సమస్యాపరిష్కారము నిర్బంధప్రాథమిక ఉచిత విద్యావిధానముతోనే జరుగగలదు

ఉన్నతవిద్యగూడా శక్తిగలవారందరికిని అందుబాటులో నుంచబడలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందినట్టి కళాశాలలయందును, మైజాంకాలేజియందును విద్యార్థుల సంఖ్యాపరిమితి ఏర్పరుపబడుటచే ఎందరో రాష్ట్రేతర విశ్వవిద్యాలయముల శరణుజొచ్చి ఉన్నతవిద్య నభ్యసించవలసి వస్తున్నది.

మనవిశ్వవిద్యా విధానమునందు ప్రాంతీయ భాషలగు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక భాషలకు సరియైనస్థాన మొసగబడలేదు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆదర్శము ప్రజల మాతృభాషల ద్వారా ఉన్నతవిద్యగరుపుటయైనప్పటికిని, అట్టి గౌరవము ఉర్దూకుమాత్ర మేలభింపజేయుట పక్షపాతము ఉన్నతవిద్యయంతయు ప్రజల మాతృభాషలయన్నిటియందును ఒసగుఏర్పాట్లు గావింపబడవలసియుండెను ఏదేని కారణమున ఇది ఆచరణయోగ్యమని తలంచిన, అప్పర్ సెకండరీ (మెట్రికుపరీక్ష) (Upper Secondary) వరకైనా నీసము ప్రజలమాతృభాష అన్నిటిలో విద్యగరపు ఏర్పాటు గావింపబడవలసి యుండెను. అట్లొనరింపక ప్రభుత్వమువారు తాముస్వయము గాప్రకటించిన ఉస్మానియాయూనివర్సిటీ ఆదర్శమునకే భంగము వాటిల్లజేయుచున్నారు. ప్రజలు తమమాతృభాషను ఇతరభాషలన్నిటికంటెను ఎక్కువగా ప్రేమించెదరు. వారిది పవిత్రమైనప్రేమ. ఈప్రేమయొక్క పవిత్రతయే వారిని ఇతరభాషలపై గౌరవదృష్టితో జూచునట్లు జేయవలయును అటులొనరించిన ప్రజలు తమమాతృభాషపై చూపుప్రేమను ఉర్దూభాషా ద్వేషభావముగా ఎంచుట అన్యాయము

మనప్రభుత్వమువారు గావించు వైద్యసహాయము అసంతృప్తికరము గానున్నది. ప్రభుత్వమువారుప్రకటించిన ౧౯౩౯ వసలీ నివేదికప్రకారము ౧౫౫ స్థిరమైన వైద్యశాలలు నెలకొల్పబడియున్నట్టు తెలిసినది మనరాష్ట్రపు వైశాల్యము ౮౨౬౯౮ చదరపుమైళ్ళు ౫౩౩ చదరపుమైళ్ళకొక వైద్యశాల నెలకొల్పబడియున్నదని దీనివల్ల తెలుచున్నది ఇవిమనరాష్ట్రపు అవసరములను ఏమాత్రము సంపూర్తింపజాలుటలేదు, పదివేలజనసంఖ్యకొక వైద్యశాల నెలకొల్పబడనిది జనసామాన్యమునకు సరియైన వైద్యసహాయము లభింపజాలదు.

### హిందూ ముస్లిము సమస్య.

నేనిదివరకే మనవిజేసినటుల హిందూజనసామాన్యముయొక్కయు, ముస్లిం జనసామాన్యముయొక్కయు ముఖ్యాతిముఖ్యమగుసమస్య వారి దారిద్ర్యసమస్య. కానికొందరుస్వార్థపరులగు నాయకులు సామాన్యప్రజలు తమనిజమైనసమస్యలను తెలిసికొనినచో తమకుగల వ్యక్తిగత లాభములు (Vested interests)కు భంగమువాటిల్లునను భయముచే, జనసామాన్యముయొక్క దృష్టిని మతసాంఘికశక్తుల వైపుత్రిప్పి, హిందూ ముస్లిం జనసామాన్యములో కలహములు కల్పించుచున్నారు. ఈరహస్యమును అజ్ఞానులైనజనసామాన్యులు తెలుసుకొనలేక స్వార్థపరులగు నాయకులమాటలే దైవవాక్కులుగానమ్మి ఒకరినొకరుహింసించుకొనుచున్నారు. హిందూ ముస్లిం ఐక్యత ధనికవర్గముకంటె నెక్కువ వారిసమస్య లొకటేయైనందున జనసామాన్యమునందేకలుగు అవకాశములున్నవి. గావునవారుతమనిజమైన సమస్యలనుగ్రహించి, స్వార్థపరులగు ఈమతసాంఘిక నాయకుల హితోపదేశములను పాటించక నిజమైనహిందుముస్లిం ఐక్యతనుకలుగజేసి, తమహక్కులకైసమిష్టి ప్రయత్నము సలుపవలెనని నేను ప్రార్థిస్తున్నాను.

ఈసందర్భమున నేనొకవిషయము తమదృష్టికి దెచ్చుటఅవసరమని తలచుచున్నాను. ప్రపంచమందంతటను, ఆధునిక రాజ్యాంగ సిద్ధాంతములయందును, ఆచరణవిధానమందును మతమునకు, రాజకీయములకునుఎంతో ఎడముఏర్పడినది. నేడు రాజ్యాంగములను తమగ్రంథములను ఆధారముగా జేసికొని మతోన్మాదులమాటలపై జరుపతలంచుట అపహాస్యమునకు కారణమే గాక ఎంతో అది వికవిధానము గాపరిగణింపబడుచున్నది ముఖ్యముగా మన భారతదేశములో మత విషవాయువు రాజకీయములలో క్రమేణాతగ్గుచున్నప్పటికి అప్పుడప్పుడు తుఫానువలె చెలరేగి దేశమునకెంతో అపకారముచేయుచున్నది. మైసూరు, తిరువాన్కూరు, భూపాల్ సంస్థానములకుచెందినప్రజలు రాజామతమునకు చెందినవారైనను వారు తమస్వత్వములను సాధించుటకై పోరాటములజరుపుచునేయున్నారు. ఇట్లెన్నియోఆధారములుగలవు. కానిదురదృష్టవశమున హైదరాబాదునందలి కొందరు ముస్లిముసోదరులు వ్యవస్థాపూర్వకముగా వింతవింతస్వప్నములుగని హైదరాబాదు మహమ్మదీయులెల్లరను రాజులనియు, మహమ్మదీయులుకానివారు రాజులు కారనియు అనేకప్రచారముల ప్రవర్తించి అందోళనకారకులైరి. రాజకీయాభివృద్ధికొరకు ఇతరులను అనుమానదృష్టితో చూచి తాముకేవలము తమకైహక్కులు సాధించి వ్యవస్థనొందతలచియుండిరి. కాని ప్రభుత్వమువారు హైదరాబాదు నేషనల్ కాన్ఫరెన్సును నిషేధించుచు అవలంబించినవిధానముచే మహమ్మదీయుల సంస్థకుగూడా అన్యాయముచేసిరి. "శాసనసభయందలి అధికసంఖ్యాకుల అధికారముతో ఉత్పత్తియగు స్వరూపముగల ప్రభుత్వనిర్మాణము ఈసంస్థలక్ష్యమైయున్నది. ప్రజాశక్యకేతుల పరిపాలనిఅవిభాజ్య బాన్ధవ్యతల [illegible] కొరకుగాను —లో నైయుండునట్టిపద్ధతి సాగుచు నేయుండవలయునని గావింపబడిన ప్రభుత్వప్రకటనమాత్రమునకిది వ్యతిరేకముగానున్నది" అని ప్రభుత్వమువారు ప్రకటించియుండిరి. దీనికే నేటికైనను మహమ్మదీయసోదరులు తమస్థితిని తెలిసికొని, తాముగూడా నిజాంరాష్ట్రపు మిగతదేశీయుల వంటి పాలితుల మేయను సంగతిమరవక, సోదరభావముతో మెలగి, పాలకవర్గము శుష్కపదాలనుపరిత్యజించవలయును. సోదరదేశీయులతో సహకారమొనర్చి, సంస్థానప్రజల రాజకీయ, ఆర్థికజీవనాభివృద్ధికై చేయూతనొసగుటకు ఇది మిక్కిలి అమూల్యావకాశమని తెలుపుచు, "అసఫ్జాహివంశ ఛత్రచ్ఛాయయందు నిర్మింపబడునట్టి బాధ్యతాయుత ప్రభుత్వమును మీరాశించుచున్నారని దీనిభావముగాతలచుచు ఒకవేళ ఇటులేదైయున ఈ ఆశేపణ పౌరస్వాతంత్ర్యమును, భావప్రకటనాస్వాతంత్ర్యమును మూలచ్ఛేదమొనర్పదనియు సంస్థానప్రజల స్వతంత్రసహకారమే రాజవంశస్థిరపరిరక్షణకు ఉత్తమమార్గమనియు నేనువాదించెదము." అనునినాదమును నిజాంరాష్ట్రప్రజలు ముక్తకంఠముతో ప్రభుత్వమునకు తెలుపవలెనని హెచ్చరించుచున్నాను.

---

## ముదిరాజ మహాసభవారి తీర్మానాలు

గతవారం హైదరాబాదులో జరిగిన ముదిరాజ మహాసభలో ఈక్రిందిముఖ్యతీర్మానాలు కావింపబడెను,

[౧] ముదిరాజసంఘములో విద్యావ్యాపకము బొత్తిగా లేదు. దానివ్యాపకము కావించవలెను. దీనికై ప్రభుత్వమువారు నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టవలెను.

[౨] అదుపిల్లలకు మాతృభాషలోనే విద్య చెప్పించవలెను. మాతృభాషలో జనులసంస్కృతి ఇమిడియున్నది. చరిత్ర ఇమిడియున్నది. అందు చేత ప్రభుత్వమువారు హిందూబాలికలకు ఉర్దూను నిర్బంధముగా చెప్పించవలెనని కావించిన అజ్ఞను ఎత్తివేయవలెనని ఈసభవారుకోరుచున్నారు.

[౩] ముదిరాజసంఘమువారు తమతమకేంద్రాలలో పాఠశాలలు వయోజనపాఠశాలలుస్థాపించవలెను.

[౪] ముదిరాజుఅనుపేర ఒకమాసపత్రిక లేక త్రైమాసికపత్రిక తెలుగు ఉర్దూ ఇంగ్లీషు భాషలలో స్థాపించవలెను.

---

## అల్యూమినంపరిశ్రమ నిబంధన

ఇకముందు హైదరాబాదురాష్ట్రములో ప్రభుత్వమువారి సెలవులేనిది ఎవ్వరున్నూ అల్యూమినంపరిశ్రమలను చేయరాదు.

---

## ఇటలీ రాజుపై తుపాకి కాల్చినవానికి మరణదండన

౧౯౪౧లో క్రింద ఇటలీ రాజుపైనను అల్బేనియా ప్రధానమంత్రిపైనను తుపాకితో కాల్చిన మిహాలిక్ వాసిల్ డాగో అనువతడు మే-౨౮వ తేదిన టిరానాలో ఒక సైనికుల మందిటిలో ఉరితీయబడెను-టిరానాలో సైనిక న్యాయాధికారులే న్యాయవిచారణచేసి మరణదండన విధించిరి-

---

## కొచ్చిను దివాను విశ్రాంతి

కొచ్చినుసంస్థాన దివానగు సర్ ఆర్.కె. షణ్ముఖంచెట్టిగారు రాబోవుజూను౩౦వ తేదినుండి దివానుపనినుండి విరమించుకొనుటకు అనుమతినీయవలసినదిగ కొచ్చినుమహారాజాగారినికోరినారు జూను౩-వ తేదినవారు రెండునెలల ప్రివిలేజి సెలవు తీసికొందురు, ఆసెలవులంతమున ఆచారప్రకారము దివానుపనినిపూర్తిగా వదలుకొందురు,

---